శ్రీరస్తు.

స్తోత్రద్వయముతోఁగూడిన

# అచ్యుతానంత గోవింద శతకములు.

(ఇందు-శ్రీనృసింహ నవరత్నమాలికా స్తోత్రము, దశావతార స్తవము, అచ్యుతశతకము, అనంతశతకము, గోవిందశతకమును గలవు.)

ఇయ్యవి

శ్రీ. ఉ. వే., శ్రీమదద్దంకి తిరుమల సమయోద్దండకోలాహల
లక్ష్మీనృసింహకుమార తిరువేంగడతాత [illegible]
లయ్యవారలుగారి [illegible]

రచింపఁబడి

శ్రీ. ఉ. వే., తిరుమల నల్లాన్ చక్ర [illegible]
శ్రీనివాసరంగాచార్య స్వామివారిచే

పరిశోధింపఁబడి

64

శ్రీవైష్ణవపత్రికయందు

ప్రకటింపఁబడి

అద్దానినుండి

ఉద్ధృతంబులై

చీరాల, ది సన్ ప్రింటింగు వర్క్సునందు

ముద్రింపఁబడినవి.

1935.

శ్రీరస్తు.

స్తోత్రద్వయముతోఁ గూడిన

# అచ్యుతానంత గోవింద శతకములు.

(ఇందు- శ్రీనృసింహ నవరత్నమాలికా స్తోత్రము, దశావతారస్తవము, అచ్యుతశతకము, అనంతశతకము, గోవిందశతకము గలవు.)

ఇయ్యవి

శ్రీ. ఉ. వే., శ్రీమత్సిద్ధాంతి తిరుమల సమయోద్దండకోలాహల
లక్ష్మీనృసింహకుమార తిరువేంగడతాత దేశికాచార్యు
లయ్యవారలుగారిచే

రచింపఁబడి

శ్రీ. ఉ. వే., తిరుమల నల్లాన్ చక్రవర్తి పండిత
శ్రీనివాసరంగాచార్యస్వామివారిచేఁ

పరిశోధింపఁబడి

శ్రీవైష్ణవపత్రికయందుఁ
ప్రకటింపఁబడి
అద్దానినుండి
ఉద్ధృతంబులై
చీరాల, ది సన్ ప్రింటింగు వర్క్సునందు
ముద్రింపఁబడినవి.

1935.

శ్రీ.

# శుద్ధాశుద్ధపత్రిక.

| గ్రంథనామము. | పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|---|
| శ్రీనృసింహ నవరత్న మాలికాస్తోత్రము. | 4 | 15 | వర | పర |
| | ,, | 22 | గల | కలి |
| | 6 | 14 | మహోలి | మహోచ్ఛవి |
| దశావతార స్తవము. | 2 | 6 | పడి | వడి |
| | 3 | 2 | నొక్కుమ్మొ | నొక్కమై |
| | ,, | 24 | నిడిన ♦ యు | నిడినయు ♦ |
| | 5 | 13 | కజ్జల | నజ్జల |
| అచ్యుతశతకము. | 4 | 23 | నిరాగ | పరాగ |
| | 9 | 10 | రాజనే | రాజవే |
| | ,, | 19 | ప్రవి × ధృతి | ప్రవి + ధృత |
| | 10 | 16 | వచ్చిక | నచ్చిక |
| | ,, | 20 | వెలిప్రాఁపి | వెలుఁబాపి |
| | 12 | 9 | కుణ | కణ |
| | ,, | 24 | సుష్కృతులఁ ఁచ | దుష్కృతులఁబీచ |
| | 13 | 1 | గాటియము పెట్టుచు | గాటియముఁ బెట్టుచు |
| | ,, | 21 | పరువడి | బరువడి |
| | ,, | 20 | ప్రి | ప్రీ |
| | 15 | 5 | వుల్లగా | పుల్లగా |
| | 17 | 18 | మనీయు | మనీయు |

| గ్రంథనామము. | పేజీ | పంక్తి | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|---|
| అనన్తశతకము. | 3 | 2 | షరస | సరస |
| | ,, | 21 | తీక్ష్ణ | తీక్ష్ణ |
| | 6 | 14 | శుత్రు | శ్రుతు |
| | ,, | ,, | శ్రుతులు | శ్రుతు |
| | 7 | 6 | నెదనటంచు | నెడయటంచు |
| | 10 | 8 | యదృషమగున | యదృష్టమునన |
| | 13 | 20 | నిచ్చలఁ | నిచ్చలు |
| | 15 | 7 | నెఱుఁగి | నెఱుఁగ |
| | 18 | 9 | బలునాల్గు | బహునాల్గు |
| | ,, | 21 | సీదుపదల | సీదుపదముల |
| గోవిందశతకము. | 5 | 13 | నని | వని |
| | 10 | 15 | తత్త్వజ్ఞానో | తత్త్వజ్ఞో |
| | 12 | 16 | ఖుండునే | జాలఁదో |
| | 14 | 8 | కన్న | కన్నను |
| | 15 | 8 | వరుసనైననతఁ | నెటనైననతం |
| | 17 | 20 | నెడ | నెద |



శ్రీమన్నృసింహాయనమః.

# శ్రీ నృసింహ నవరత్నమాలికా స్తోత్రము.

సీ. శ్రీరమణీ కుచ ♦ శ్రీగంధ సంవాసి
తోరసుండు సునాభి ♦ సారసుండు
పాణిపంకజధృత ♦ భాసుర ాధవర
సాధనుండు హితైక ♦ బోధనుండు
కరుణారసోద్వేల ♦ కమలదళాయత
లోచనుండు రుబన్ధ ♦ మోచనుండు
స్వాశ్రిత జనలోచ ♦ నాసేచనక దివ్య
దర్శనుండు ఖలౌఘ ♦ కర్శనుండు

తే. మందహాసాంచితాధర ♦ మధుర వదనుఁ
డుద్ధత హిరణ్యదారణో ♦ ద్యోగ నవ్య
రక్తకుంకుమ పంకాను ♦ షక్తమూర్తి
మనుజ సింహుండు మము వేడ్క ♦ మనుచుఁ గాత. ౧.

మత్తేభ కంద గర్భిత సీసము :—

అభవ సంసేవ్య ప ♦ దారవింద కరుణా
పాథోనిధీ దేవ ♦ పార మేశ
సుకవిసంస్తుత్య య ♦ శోవిభాసుర జగ
త్కల్యాణ దానోత్సు ♦ కా యజేయ
త్రిభువనాధీశ ప ♦ రీభవాపహరణా
భూరి ప్రభావ స్ఫు ♦ రా రిపుఘ్న
ప్రభవ సంతారక ♦ భాగధేయ విభవ
ప్రాప్య ప్రసన్నప్ర ♦ భా నృహేశ

తే. ద్రుహిణ జనికారణాద్భుత ♦ మహిత లలిత
నలిననాభ మధుమథన ♦ నయ గ్రహీల హృ
దయ శశిరుచిర శ్రితహిత ♦ దనుజనివహ
దలన తరుణ రవిరుచీ వి ♦ దారితార్తి. —౧.

గర్భమత్తేభము :—

భవసంసేవ్యపదారవింద కరుణా ♦ పాథోనిధీ దేవపా
కవిసంస్తుత్యయశోవిభాసుర జగ ♦ త్కల్యాణదానోత్సుకా
భువనాధీశ పరీభవాపహరణా ♦ భూరిప్రభావస్ఫురా
భవసంతారక భాగధేయవిభవ ♦ ప్రాప్య ప్రసన్నప్రభా.

గర్భకందము :—ద్రుహిణజనికారణాద్భుత
మహిత లలితనలిననాభ ♦ మధుమథన నయా
గ్రహీలహృదయ శశిరుచిరశ్రి
తహిత దనుజనివహదలన ♦ తరుణ రవిరుచీ.

సీ. బలిదైత్యు వాకిటఁ ♦ బడిగాపువై ప్రోవ
నేర్తువు మముఁ బ్రోవ ♦ నేరవా శౌరి
రక్షోధిపునిఁ జీల్చి ♦ ప్రహ్లాదుఁ గృపఁ బ్రోవ
నేర్తువు మముఁ బ్రోవ ♦ నేరవా శౌరి
అన్నంబు రహిమెక్కి ♦ యవ్విదురునిఁ బ్రోవ
నేర్తువు మముఁ బ్రోవ ♦ నేరవా శౌరి
అన్నింటి కీవయ్యె ♦ యల పాండవులఁ బ్రోవ
నేర్తువు మముఁ బ్రోవ ♦ నేరవా శౌరి
తే. ఉత్తరా గర్భమధ్యమం ♦ దున్న శిశువు
నేరుతువు ప్రోవ మముఁ బ్రోవ ♦ నేరవా శౌరి
నేటిదా? సంశ్రితులఁ బ్రోచు ♦ మేటి బిరుదు
నీదు నెమ్మది నరయుమో ♦ నీరజాక్ష. ౩.

సీ. అబ్బవంకనఁ జుట్టి ♦ మా నీవు రవిసూనుఁ
గొలుమి నేలితి వైంద్రి ♦ నెడయఁ జేసి
అమ్మవంకనఁ జుట్టి ♦ మా నీవు రాక్షసుం
డలరి ప్రోచితి వన్న ♦ ననినిఁ దునిమి
మామవంకనఁ జుట్టి ♦ మా నీవు గృధ్రరా
జు లలి నిచ్చితి విల్లుఁ ♦ జూరఁగొనగ
నాలి వంకనఁ జుట్టి ♦ మా నీవు మారుతి
కృపను జేర్చితివి కా ♦ గింట నంటి
తే. ఏమివంకని బలుగాకి ♦ నెంచి గాచి
తట్టి వంకలు నీవు మా ♦ కరయు లేద
టంచునో! మసవగు వంక ♦ లట్లుగా వె
టంచుఁ దలఁచితివో? మది ♦ నంబుజాక్ష. ౪.

సీ. వెఱవనించుక నీదు ♦ వెడద కోఱలఁ గాంచి
వెలదిలేనవ్వాఁకు ♦ వెఱచినట్టు
లలుక సింహాముఖుఁడి ♦ నట్టు నెమ్మదిఁ గని
యతివ కన్నొసను సైగ ♦ కళికి నటుల
తలర నీ బొబ్బరిం ♦ తల బరువడి విని
తరుణిలోఁ గుఱిక్కపడుఁ ♦ దలరినటుల
జడియ నీదగు జడ ♦ ల్చక్కఁ గనుంగొని
చానవేనలికి లో ♦ జడిసినటుల
తే. బఱవఁ గ్రొన్నెత్తుటను దోగి ♦ వన్నెమీఱు
నీదు బలువాఁడి గోరుల ♦ నీటుఁ జూచి
యలరుఁబోఁడుల సునుమేన ♦ నంటి మిగుల
వఱలు నెలవంకలకు వడిఁ ♦ బఱచి నటుల. ౫.

సీ. వైనతేయగరున్న ♦ భస్వన్నినాద సం
మిలిత శంఖ ధ్వను ♦ ల్సెలగవలయు
వరదుర్నిరీక్ష్య ప్రి ♦ భాభాసమాన సు
దర్శనం బెలమిని ♦ డాయవలయు
శయసముజ్జ్వల శంఖ ♦ చక్రిలు వృత్త దం
ష్ట్రాస్యులు భవదీయు ♦ లలరవలయు
వనరుహావాసిని ♦ వక్షస్థలంబున
వఱల విచ్చేసి నీ ♦ వరయవలయు
తే. తనువు వీడెడి వేళ నిట్టి ♦ దలఁపఁ దలఁపు
గలగినను గల్గకున్నను ♦ గరము వేడ్కఁ
బ్రోవుమని నేఁడె వేఁడితి ♦ దేవదేవ
నఖవిదళిత దనుజసింహ ♦ నారసింహ. ౬.

స్రగ్విణీ భుజంగప్రయాత ద్రుతవిలంబిత గర్భిత సీసము :—

హితతమస్వాశ్రితా ♦ భీష్టదా శర్వసే
వ్యాకృతీడ్యా పతం ♦ గాధిరోహ
మధుహర విశ్రుతా ♦ మ్నాయగా విశ్వరూ
పా బుధాగ్ర్య కృపా ♦ ప్లావితాత్మ
అభిరామ సుశ్రుతా ♦ ఢ్రాత్మకా సూరిసు
వ్యక్తభాసా పరాం ♦ బరనివాస
యమివరప్రశ్రితా ♦ ధ్యాత్మ తత్త్వ ప్రసి
ద్ధ ప్రభావా సదా ♦ తన ముకుంద

తే. సరసిజాసన సన్నుత ♦ సాధుపాల
పరహిరణ్య విపాటన ♦ పాటవాఢ్య
శరభ దుర్మద సాదన ♦ శర్మదాన
నరహరీ! నయనందిత ♦ నారదాద్య. ౨.

గర్భస్రగ్విణీ :—స్వాశ్రితాభీష్టదా ♦ శర్వసేవ్యాకృతీ
విశ్రుతామ్నాయగా ♦ విశ్వరూపా బుధా
సుశ్రుతాఢ్రాత్మకా ♦ సూరిసువ్యక్తభా
ప్రశ్రితాధ్యాత్మ తత్త్వ ప్రసిద్ధ ప్రభా.

గర్భ భుజంగప్రయాతము :—

శ్రితాభీష్టదా శర్వ ♦ సేవ్యాకృతీడ్యా
శ్రుతామ్నాయగా విశ్వ ♦ రూపా బుధాగ్ర్య
శ్రుతాఢ్రాత్మకాసూరి ♦ సువ్యక్తభాసా
శ్రితాధ్యాత్మ తత్త్వ ప్ర ♦ సిద్ధ ప్రభావా.

గర్భ ద్రుతవిలంబితము :—

సరసిజాసనసన్నుత ♦ సాధుపా
పర హిరణ్య విపాటన ♦ పాటవా
శరభ దుర్మద సాదన ♦ శర్మదా
నరహరీ! నయనందిత ♦ నారదా.

సీ. జఠరాంతరస్థిత ♦ జగదండ నివహంబు
దంష్ట్రలఁ బ్రతిఫలి ♦ తంబుగాఁగ
ప్రవికట భ్రూకుటీ ♦ ప్రచుర తమిస్రంబు
లోచనారుణదీప్తి ♦ లోఁగొనంగ
చంచలాంభీల జి ♦ హ్వాంచల రోచులు
కఠినసటాంశులఁ ♦ గలసి వెలుఁగ
ఖరతరనఖర రే ♦ ఖా ప్రతిభాసిత
స్వప్రతిబింబముల్ ♦ చక్కఁ జెలఁగ
తే. నిజతను మహావిచ్ఛటా ♦ నిర్జితేంద్ర
జాలభాసిత సప్రపం ♦ చ ప్రపంచ
దర్శన విమూఢ మానస ♦ దైవతముగ
మనుజహర్యక్షతనుఁ దాల్చి ♦ మహితుఁగొల్తు. ౮.

సీ. ద్యుమణికోటి ప్రభా ♦ దుర్నిరీక్ష్యాత్మది
వ్యప్రభాభాసితా ♦ శాంతరాల
ముజ్జ్వలజ్వాలన వి ♦ ద్యుజ్జ్వాలికాజాల
జాజ్వల్యమాన స్ఫు ♦ జత్స్ఫులింగ
మావిర్భవద్భయా ♦ దాట్టహాసారవ
శ్రవణ దిఙ్నాథాసు ♦ ర ప్రపంచ

మంచితెఁ భ్రుకుటి దం ♦ ష్ట్రాగ్నికీలలోచన
త్రయము రాలోక వ ♦ క్త్రకమలంబు

తే. నైన దివ్య సుదర్శనం ♦ బధిగమించి
నాల్గుచేతులఁ జక్రముల్ ♦ నల్వమీఱ
దివిరి యోగాసనంబునఁ ♦ దేజరిల్లు
దివ్య నరసింహు నినుఁ బ్రస్తు ♦ తింతు భక్తి. ౯.

చ. సరసిరుహాక్ష యేవరుసఁ ♦ జక్కఁగ నీ నవరత్నమాలికన్
గరమరుదారఁ గూర్చునటు ♦ గానొనరించితొ యీజడాత్ముచేఁ
గరుణదలిర్ప నావరుసఁ ♦ గైకొని బ్రోవుము సంశ్రితార్తిని
ర్హరణ నృసింహ దారితహి ♦ రణ్య శరణ్యవరేణ్య మాధవా.

శ్రీ నృసింహ నవరత్న మాలికా స్తోత్రము

సమాప్తము.





శ్రీమతేహయగ్రీవాయనమః.

# దశావతారస్తవము.



## సీసపద్యములు.



౧. కమ్రమై కరుణాఢ్య ♦ కమ్రమై విరియు కెం
దమ్రమై కనులు ♦ ప్రేమమ్ముఁ గురియు
సాంద్రమై తోఁగజేని ♦ చంద్రమై త్రిభువనా
నందమై నెమ్మోము ♦ చిందఁ గళల
సమ్రమై ఘోరకుం ♦ సమ్రమై వక్రసా
రమ్రమై మీసలు ♦ చిమ్మ రిపులఁ
జండమై విదలితా ♦ జాండమై జయకేతు
దండమై పుచ్ఛకాం ♦ డము చెలంగఁ
ప్రళయసమయసముద్వేల ♦ భయదజలధి
నిరవధివిహారసంభ్రమ ♦ నిరుపమాన
దివ్యపాఠీనమూర్తివై ♦ దితిజుఁ ద్రుంచి
నిగమముల నుద్ధరించిన ♦ నిపుణు నెంతు.

౨. దైవతప్రవరుల ♦ దానవశ్రేష్ఠులఁ
బ్రచ్చేడివాండ్రఁగా ♦ దగ నొనర్చి
మహీధరరాజమౌ ♦ మంథరమును వేడ్క
మంథదండముఁ జేసి ♦ మహితశక్తి
వాతాశనాధీశు ♦ వాసుకి నేర్పుమై
వాటంపు దాడుగా ♦ వడిఁ దనర్చి
జలధిరత్నంబునాఁ ♦ జను పాలమున్నీటిఁ
జాలిన కడవగఁ ♦ జక్క సలిపి
మొనసి వెన్నన సులఁదాల్చి ♦ మున్నకుండ
నగ్రహస్తంబునను వల్ల ♦ కణఁచిపట్టి
యబ్జవాసినియను సుధ ♦ నబ్బుకొనిన
జరఠకమఠస్వరూపుని ♦ సారె నెంతు.

[ అచ్చ తెలుఁగు. ]

3. కొమ్మునఁ జదియంగఁ ♦ గుమ్మిన రేఁచుని
ప్పుక జాళువాకొండ ♦ పొరిగరంగ
నిక్కజడల్ చక్క ♦ నిగుడింప నడరు పీ
వలిడాక నెమ్మొగు ♦ ల్వాలనుకొరుగ
పాళిమై మున్నీట ♦ నట్టిట్టు పొరలిన
నీరెల్ల కలఁకలై ♦ నింగి కెగయ
మొనసి యొక్కొకపరి ♦ మోకరించి యొకింత
గురువెట్టఁ బాఁబల్కు ♦ కొనలిడంగఁ
గొరయును మల్లియును జేరి ♦ కొమరుమిగులు
తేఁటిలేమయొ నామంటి ♦ తెఱవ గాదిల
మున్ను రక్కసుఁ బొరిగొన ♦ మొక్కలమున
ముట్టిమెకమైన నిను లలి ♦ మొక్కుచుందు.

౪. స్తంభంబు దనుజను ♦ డ్డంభంబు శౌర్యసం
రంభంబు నొక్కుమ్మ ♦ వ్రక్కలింప
పాపమ్ము దుష్టావ ♦ లేపమ్ము విబుధసం
తాపమ్ము వడి నొక్క ♦ తఱిని దీర్పఁ
గారుణ్యమును గోప ♦ తారుణ్యమును స్వసా
ధారణ్యమును విశ ♦ దమ్ముసర్వ
విక్రమ మ్మఖిలార్త్య ♦ పక్రమమ్ము నతావ
నక్రమమ్మును భువ ♦ నమున నెరప
నిజపదసమాశ్రితార్తిని ♦ నిజము సేయఁ
కీర్తిగుణంబులఁ దీక్ష్ణదం ♦ ష్ట్రికలతోడ
వజ్రనఖములు బరువడి ♦ వాడిమీఱ
మనుజసింహాకృతిని దాల్చు ♦ మాన్యుఁ గొలుతు.

౫. ఎల్లర కెల్లపు ♦ డెల్లకోర్కెల నిచ్చి
నేదారు నెటు వేఁడ ♦ నేర్తు ననియొ
యాచనాప్రాప్తి బ ♦ ల్కిచంబులకుఁ బాలు
పఱచునట్ బలుచింతెఁ ♦ బడుటనొక్క
ఎటువంటివాఁడైన ♦ నెనయుఁ గష్టంబుల
సుఖముల ననుచొప్పుఁ ♦ జూపనొక్క
ఎల్లపు డొకవహి ♦ నెవనికి జరుగంగ
నేరదంచు హితంబు ♦ నేర్పనొక్క
సిగ్గుచే గాత్రములలోనఁ ♦ జేరినటుల
పొట్టివడుగయి క్రిందికి ♦ మెట్టి బలినిఁ
ద్రివిక్రమంబుల జగముల ♦ నాక్రమించి
యింద్రునకు వేడ్క నిడిన ♦ యుపేంద్రుఁ గొలుతు.

౬. తొలువొల్ల నెవ్వాఁడు ♦ తొలుబుట్టువులనల్ల
చవి పరశ్వధముకుఁ ♦ జక్కఁ జూపెఁ
దొడిసి యెవ్వఁడు కార్త్య ♦ నాసన్నుఁ బరశువు
దల్లికుత్తుకనల్లఁ ♦ ద్రావఁజేసెఁ
గార్తవీర్యుని భుజా ♦ గర్వంబు వడిఁబాపి
యెఱఁజేసె నెవ్వాఁడు ♦ పరశువునకు
రాజుల నెత్తురుఁ ♦ ద్రావించి పరశువు
గఱ్ఱనఁ దేర్పించె ♦ గరిమ నెవఁడు
రాజపర్వతనిస్సర ♦ ద్రక్తపూర
పూరితశమంతపంచకం ♦ బునను దోగి
యెవఁడు పితృతర్పణ మొనర్చె ♦ నింపుమీఱ
నతని భృగువంశమండను ♦ నభినుతింతు.

౭. తల్లిదండ్రులు లేక ♦ తడవాడి నెమ్మది
దశరథుఁ దండ్రిగాఁ ♦ దలఁచె నెవఁడు
మునుల వెంబడిఁ బడి ♦ మునుకొని యల్లాడి
జనకజ జాయఁగాఁ ♦ గొనియె నెవఁడు
వనములఁ ద్రిమ్మరి ♦ వనట బొమ్మరవోయి
కోఁతి నసుంగుఁగాఁ ♦ గోరె నెవఁడు
జలనిధి వడిదాఁటి ♦ చని యగ్రజులఁ దుంచి
యనుజున కిడె రాజ్య ♦ మరితె నెవఁడు
అనుఁగుతమ్ములు కొలువఁగ ♦ నతివఁ గూడి
యిలఁ బదునొకండువేలేడు ♦ లేలె నెవ్వఁ
డిడుముల నెవండు పోకార్చె ♦ నిడు శుభముల
నతని రఘువంశమండను ♦ నాశ్రయింతు.

౮. ఎవ్వాఁడు కిన్కమై ♦ నిభపురి సురనదిఁ
దోయంగ నుంకించె ♦ దోర్బలమున
నెవ్వాఁడు క్రీడింప ♦ నేచినవడిఁ దను
డాయంగ రప్పించెఁ ♦ దరణితనయ
నెవ్వాఁడు తనుఁగాంచి ♦ యిగిలించిన కళింగు
బండ్లు దుల్లగ మోది ♦ పనిచె దివికి
నెవ్వాఁడు వీకమై ♦ నెదిరిచి రిపుల లాం
గలమునఁ బెనచి రో ♦ కట నడంచె
నధిగతకకుద్మికన్యాము ♦ ఖారవింద
వాసపరిమలమదిరాధ ♦ వాసితాస్య
పంకరుహుఁ డెవ్వఁ డవ్వానిఁ ♦ బ్రిబలు వేడ్కఁ
బ్రస్తుతు లొనర్తు బలభద్రు ♦ బహులభద్రు.

౯. ఒక తెచన్నవఁ బట్టి ♦ యొక తెకజ్జల మొట్టి
యొక తెచెక్కులఁ జీటి ♦ యొక తెఁ గేరి
యొకరి తెఁ గనుఁగీటి ♦ యొకరి తె రహిమాటి
యొకరి తెపైనంటి ♦ యొక తె గెంటి
యొక తెకోక సడల్చి ♦ యొక తెపోక నదల్చి
యొక తెకొవ్వెద వీడ్చి ♦ యొక తె నీడ్చి
యొక తెవాతెర నొక్కి ♦ యొక తెపేరెదఁ జొక్కి
యొక తెసిగ్గడలించి ♦ యొక తెఁ బొంచి
యొక తెఁ గికురించి యొకరి తె ♦ నూరడించి
యొక తెఁ గౌగిటఁ జేరిచి ♦ యొక తెఁ దేర్చి
యన్నిటఁ బ్రబుద్ధుఁడైన యా ♦ చిన్నికృష్ణు
బాళి మది నెంతుఁ బలుమరుఁ ♦ బ్రస్తుతింతు.

౧౦. శ్రుత్యాగమాదిసం ♦ చోదితధర్మ్యంబు
పోరి నాదఱకు వెను ♦ పోటుగాఁగ
నెలమిఁ బెద్దలఁ గన ♦ నెదు రేగుటన్న న
య్యాది యెల్లరకును జు ♦ క్కేసుసుగాఁగ
వివిధజగద్వ్యాప్త ♦ విష్ణుకథాసమా
కర్ణన షష్ఠాష్ట ♦ కంబుగాఁగ
భవదీయదర్శన ♦ భాగ్యమూడుట గల
వారికి నైధన ♦ తార గాఁగ
మించుకలికల్మషంబున ♦ మ్లేచ్ఛులైన
ఖలులఁ బోరిగొనఁ గరమున ♦ ఖడ్గమూని
లలితతురగాధిరోహక ♦ లాఘుశలత
నలరు కల్క్యాత్మఁ బరువడి ♦ నభినుతింతు.

తే.గీ. ఏడమూకునిచే రచి ♦ యింపఁజేసి
రవణమిూఱ దశావతా ♦ రస్తవమ్ము
నెలమిఁ జేకొని నాశ్రిత ♦ సులభవృత్తి
నేవఁడో యవ్వాని మనమున ♦ నెంతు నెపుడు.

దశావతారస్తవము

సమాప్తము.



శ్రీమతేరామానుజాయనమః.

# అచ్యుతశతకము.

## చంపకమాలలు.



౧. సిరియును భూమి నీళలును ♦ జేరువఁ జేరి భజింపుచుండ నో
క్కరితెనుఁ జుంబనాంచితను ♦ ఖంబున వేఱొకతెన్ భుజాగ్రసం
గ రసరతిన్ మఱొక్కతెను ♦ గారవ మొప్పఁ గపోలపాలికా
కరపరిమర్శనిర్వృతిని ♦ గన్కనిఁ దేల్చెదుగాదె యచ్యుతా!

౨. ఒకపరినిన్ను సంశ్రయణ ♦ మొప్పఁగఁ జేసినవారికెల్ల నీ
వకపటశీలతన్ స్వలఘు ♦ తాంచితగౌరవముల్ దలంపకే
సకలము సమ్మదమ్మునను ♦ సంఘటనంబొనరింతు వీప్సితం
బికనెఱిఁగింపఁగావలయు ♦ నే? యఖిలజ్ఞున కెందు నచ్యుతా!

౩. మెడకొక చీటిఁగట్టి నిను ♦ మేనమఱందివటంచు బాండవుల్
కడువడిఁ బంపరే త్మదు ♦ కర్జముకై కురురాజుపాలికిన్
బడుచును లేచుచున్ రహిని ♦ బర్వవె నీవలనాఁడు నేఁడు నె
య్యుడఁదగుఁగాదె నీకిదియ ♦ యెన్నితెఱంగులనైన నచ్యుతా.

౪. మరునకునగ్గమైయకట ♦ మానినిపాదములందువ్రాలుచో
శిరమునదాఁచినన్ మదిని ♦ సిగ్గొకయించుకలేక పాదమున్
గరమునఁబట్టి మాటికిని ♦ గారవమొప్పఁగ నెంతనొచ్చెనం
చరసెడి నీదుపౌరుషమె ♦ యబ్బురపాటొనరించు నచ్యుతా.

౫. చెలియలి నేకతంబునను ♦ జిష్ణునకుం గరిహిం దార్చి యల్లనం
పొలధరుఁ గన్నఁ బ్రామి తగ ♦ నందర వే గికురించినట్టి నీ
బలితపుదంభకౌశలముఁ ♦ బల్మరు నాశ్రితపాక్షికత్వముం
దలఁచిన నీరోసర్పదె మ ♦ నంబులఁ బాలుర కేని నచ్యుతా.

౬. సరసిరుహాసనాద్యమర ♦ సత్తమమౌళిదురాపకల్పభూ
మిరుహనవప్రవాళరుచి ♦ మేదురభవ్యభవత్పదద్వయీ
పరిచయమిమ్మెడం బెరటఁ ♦ బండిన వేలుపుమ్రానుగాఁగ నీ
వరమరలేనికూర్మి మము ♦ నారసి బ్రోతువుగాదె యచ్యుతా.

౭. జలధిసుతాకరాంబురుహ ♦ సంవహనోచితసౌకుమార్య ము
జ్జ్వలహరిచందనాభినవ ♦ పల్లవరాగమహాభిరూప్య ము
ల్లలితరణత్పదాంగదక ♦ లస్వనసుశ్రుతివిశ్రుతంబునై
యలరుభవత్పదద్వయము ♦ నంటిన ప్రేముడిఁ గొల్తు నచ్యుతా.

౮. దధిరపశిక్షితాభినవ ♦ తాండవ మద్భుతౌస్తినాగ్గణా
భ్యధికవిమర్దసమ్మిలిత ♦ పాటలిమంబు జగత్ప్రియంకరం
బధిగతదాత్యదోహల మ ♦ నారతసంశ్రితరక్షణక్షణా
బుధితజలస్థలంబునయి ♦ పొల్చు భవత్పదయుగ్మ మచ్యుతా.

౯. కురుకులపాంసనుల్ కొలువు♦కూటమునం దసవల్వనూడ్చుచో
నరువున నీదు పేరుఁ గొని ♦ నంతనె యాద్రుపదాత్మజాతకు
చ్చెరువుగ నక్షయంబులగు ♦ చీరలు నేకులె నీవు దవ్వుగా
నరగిననైనఁ గావగల ♦ దారసి నీదగునామ మచ్యుతా.

౧౦. కరివరునార్తనిస్వనము ♦ కర్ణపథంబులతూరంగ వచ్చుచోఁ
గరమనురక్తిఁ గాచుటకుఁ ♦ గాఁ బరువెత్తిన నాటిసంభ్రమం
బరుదొనగూర్చు నాశ్రితుల ♦ నర్తిఁ బ్రోవఁగ నీదు పేరురం
బిరవుగఁ జేసికొన్న సిరుల ♦ యిందిరకైన నసుగాని యచ్యుతా.

౧౭. అరుదుగఁ దోఁచి యెల్లరకు ♦ నాశ్రయణీయ మనోహరాకృతిన్
దురితముతోడ రష్టనుచుఁ ♦ దోరపు బ్రేముడి నానతిచ్చినన్
గరమనురక్తి నిన్నుఁగనఁ ♦ గాంక్ష యొనర్పరుగా నిరూఢని
ర్భరనిజమోహ నిత్యపరి ♦ భావితులై యకృతాత్ము లచ్యుతా.

౧౮. కలికలిలస్వభావు లిలఁ ♦ గర్మఫలంబుఁ బరిత్యజింపఁగా
నలఘుతరాజ్ఞ నీవిడిన ♦ నయ్యుపసర్గకు సార్థకత్వ మె
ట్లలవడె నంచుఁ గర్మముల ♦ నాఁకిలిలేక పరిత్యజింతు నీ
కలఁకువఁ దేల్పఁగా వలను ♦ గాదొకొ కొండొక యోనినచ్యుతా.

౧౯. తనుఫలదంబు కర్మమని ♦ తావిడనాడినఁ జెల్లునెట్టు ల
వ్యనఘులు పూర్వసూరులిటు ♦ లారసి గన్గొనఁజాలకొక్కొ తా
రనయము కర్మనిష్ఠులగు ♦ టద్దిర నీదగు నానతిన్ శిరం
బునఁ గదియించు టొప్పనుచు ♦ బుద్ధిఁదలంచి యొగాని యచ్యుతా.

౨౦. నోడువఁగఁ జుల్కనౌ నెకద ♦ నోరొకయించుక నొవ్వఁజేయ దే
వ్వడుపున నాల్కకుం జవుల ♦ వారిగఁ గూర్చుచు నెల్లవేళలన్
దడయక నెమ్మదిం దలఁపఁ ♦ దల్లడపాటొనగూడఁ జేయదే
బడలికనైన మాన్పు వసు ♦ వర్ణభవన్మనురాజ మచ్యుతా.

౨౧. వలదు సదావగాహన మ ♦ వార్యతుషారజలాపగోర్ములన్
వలదు పదప్రచార మతి ♦ వక్రపథాటవికస్థలంబులన్
వలదు నివాస ముగ్రతర ♦ పర్వతసాను గుహాంతరంబులన్
వలదు పరిశ్రమంబు వసు ♦ వర్ణమనుస్మృతిశీలి కచ్యుతా.

౨౨. ఎఱుఁగఁ దపంబు మున్నగున ♦ హీన కృతిప్రకృతి ప్రణిష్ఠితం
బెఱుఁగ శ్రుతీతిహాస సము ♦ దీరిత చారుతరార్థ నిర్ణయం
బెఱుఁగ నిరూఢ భక్తిభర ♦ హృద్గతి యోగచిరార్థదర్శనం
బెఱుఁగఁగదే ప్రపత్తిపథ ♦ మెవ్విధిఁ గాచెదొ నన్ను నచ్యుతా.

౨౩. అవతరణంబు లెల్లెడల ♦ నర్థి నొనర్చుట తావకాశ్రిత
ప్రవరుల కప్పటప్పటికిఁ ♦ బాటిలు పాటులనెల్లఁ దీర్చి బ్రో
చు వలను వేడ్క గన్పఱచు ♦ చొప్పగుఁగాని మఱొండుగాదు గా
న వలచి నిన్నె ప్రాపుగఁగొ ♦ నం గమకించితి నిప్పుడచ్యుతా.

౨౪. చిపిటము లించుకంత తన ♦ చెంగునఁ గట్టుక నిన్నుఁగాన వ
చ్చుపుడమివేల్పుమానసము ♦ చొప్పడఁగాంచి యెదుర్కొనంగనే
గి పిడికెడందులంగొని యొ ♦ గిన్మరలం గొనఁబోవ నీదు కే
లపుడటుబట్టి కల్మిచెలి ♦ యాపిన యాపిఁ దలంతు నచ్యుతా.

౨౫. మఱచితి నిన్ను నీదుమహి ♦ మంబుల నీదగు వానిగా ననున్
మఱచితిఁ ద్వత్పదాశ్రితుల ♦ మాన్యుల సూరుల మద్ధితైషులన్
మఱచితి సాధుకృత్యముల ♦ మానక చేసెడి యట్టితీరులన్
మఱచితి నైననిప్పు డెటు ♦ మన్ననఁగాచెదొ నన్ను నచ్యుతా.

౨౬. కొలిచితి నన్యదైవములఁ ♦ గూరిమి నామది శంకదక్కి వే
వలచితి నన్యభామినుల ♦ వాలికచూపులకోడి యేత్తెఱన్
దలఁచితి నన్యవిత్తముల ♦ దారుణవృత్తిఁ బరిగ్రహింపఁగా
నిలచితి నానవో నిపుడ ♦ నీయెదుటన్ వెఱపేది యచ్యుతా.

౨౭. ప్రకృతియు నిత్యమాత్మయును ♦ బ్రాయఁగరానిది కర్మమెట్లు వి
ప్రకృతముగాఁగ నోళు నిటఁ ♦ బ్రాకృతమొంతయుఁ గర్మనిష్ఠ చే
వికృతులఁ గాంచి కాంచి పరి ♦ వృద్ధి వహించు నెకాని మాయ వి
ప్రకృతులఁజేసి మమ్ముఁగొని ♦ పల్లఱు నాడెదుగాదె యచ్యుతా.

౨౮. కడఁకఁ గృపారసంబొలుకు ♦ కన్గొన చూపొకయింత నాపయిన్
గుడికొనఁ జేయఁగాఁ దలఁపు ♦ గూడదు నీకిఁక నేమిసేతు ని
న్నెడవెడనాడ నాకగునె ♦ వెఱ్ఱికి వేయివిధంబులంట నీ
యెడ నిజమాయెనాదువిధి ♦ యెట్లుగనున్నదొ కాని యచ్యుతా.

౨౯. కలుషములున్నఁ గావనని ♦ గట్టిగ మున్నెఱుగంగఁ బల్కి నీ
గలుషములెల్ల బాయఁదగు ♦ కర్జములన్ గరమర్థిఁ జేయు మే
కలుషములున్న నేనయినఁ ♦ గాచెద నన్ శరణంబు గోరువా
రల నని సింధుతీరమున ♦ రచ్చనసం బనియేమి యచ్యుతా.

౩౦. ప్లవగులగోష్ఠిఁ బల్కినల ♦ పల్కులకేమియుఁ బట్టు గల్గదం
చో వనధివీచిఘోష నవి ♦ సోకవటంచునో యేరివీనులన్
గవు డెదబూని నన్నిపుడు ♦ గావక యుండిన మిన్నకుందునే
తివిరి నినుం బదింబదిగఁ ♦ దేఁకువ ఉవ్వాకుఁదేక యచ్యుతా.

౩౧. అనవరతంబు నాశ్రితుల ♦ నర్మిలి బ్రోచి గడించువాసి నీ
వని మొనఁగ్రిందుపైబడియు ♦ హాంయుసురారులఁద్రుంచియైనఁ జే
కొనఁగల వేజయం బెటుల ♦ గొంటివొ యూరయుమీవ పూర్వసూ
రి నివహశాసనంబడరి ♦ రేపవలానినఁ గాక యచ్యుతా.

౩౨. తటుకున నా కుచేలునకుఁ ♦ దప్పక సంపదలూరకిచ్చితే
యటమటలేక చెప్పుమిపు ♦ డారజముల్ మది నెంచితేని నీ
వటుకుల కేల యాసపడి ♦ యబ్బుకొనం దలకొంటివంత కే
లటువలె బట్టి కల్మిచెలి ♦ యాఁపఁగనేమి కతంబొ యచ్యుతా.

౩౩. అడుగకయున్న నన్నుమిడ ♦ దమ్మయు నన్నటు లిప్పుడేను ని
న్నడిగితి నెల్లభోగముల ♦ నాత్మహితంబుల నిష్మటంచు నీ
వడుగక యున్న నీయఁగల ♦ వంచు నెఱింగియు నాత్రమొప్ప ని
న్నడుగుట వంచనంబనుచు ♦ నచ్చలమూనకు మాత్మ నచ్యుతా.

౩౪. అడుగకమున్నె కావఁ గర ♦ మర్థిఁ గడంగెడి నీవు నిప్పుడే
నడిగినఁ గావకుంటయె ♦ యర్హమటంచు మదిం దలంచితే
యడుగుఁ గదల్పనీయ నిఁక ♦ నర్గిన సేమయినన్ దిరంబు ని
న్నెడపక ప్రోవఁగా నభయ ♦ మిచ్చితి నంచనుదాఁక నచ్యుతా.

౩౬. గ్రహబలమేమొకాని బలు ♦ కల్లరి వైనను నిన్ను పేర్కొనన్
రహిఁ బరువెట్టునామనము ♦ రట్టడికోర్తువు కాని లోకసం
గ్రహమునకైన ధర్మమునఁ ♦ గట్టుపడం గమకింపవీవు నీ
వహిఁ గనువారు నిన్ననను ♦ వావిరి గేలియొనర్తు రచ్యుతా.

౩౭. జగముల నేలఁగావలయు ♦ చక్కని దైత్తుల వెట్టు నేర్వఁగా
నగు మొఱకంపు గొల్లనికి ♦ నప్పుడుగాదిప్పుడైన నాపుపా
ల్చుగబుగవల్చు నెమ్మయిన ♦ పూర్వపురూపము లెన్ని దాల్చినన్
దగుగతి వేఱులేక నినుఁ ♦ దప్పక కొల్తుమొకాని యచ్యుతా.

౩౮. అరయఁగనూరు పేరుకొల ♦ మగ్గముగాదొక యించుకేనియున్
జెరయుదుగా గుణంబు నిను ♦ బేరజపుం బనులన్న నెన్నియే
నరమర లేక చేసితివి ♦ యాలికి మ్రొక్కితివిట్టి నీవు నే
నరుసను మన్ననల్పడయ ♦ వచ్చుమదిం దిలకింపు మచ్యుతా.

౩౯. అవిరత యోగనిష్ఠ హృద ♦ యాంతరసీమ వసించునాఁడు నీ
వవిరల కల్పవారిధి మ ♦ హావటపత్రమునన్ బరుండు నాఁ
డపిదితవృత్తి మాతృజఠ ♦ రాంతర మిమ్ముగఁ గొన్ననాఁడు నే
పరుసన నుంటివో తెలియఁ ♦ జాలనె టక్కులికేటి కచ్యుతా.

౩౯. తనరినవేడ్క నీదు తలి ♦ దండ్రులు వెట్టిన వెన్నపాలుచా
లనికతనన్ వ్రజాంగణముల ♦ న్ జోరఁబాటికడంక మ్రుచ్చిలిం
చిన నెయి పెర్వు మీఁగడయుఁ ♦ జిత్తములర్వఁగ నారగించి పెం
చిన మనుబొజ్జఁగాంచి హరు ♦ సింపుదు వే మొదురాడ వచ్యుతా.

౪౦. జనని యులూఖలంబునను ♦ జయ్యన గట్టుచు వేళఁ గిన్కమై
కొనకొని యెన్ని దామములఁ ♦ గూర్చిన నీయుదరంబుఁ జుట్టిరా
ని నయముఁగాంచి యెంతయును ♦ నేర్పునఁ బేర్పడఁగట్టిగా దెనిన్
దనయుఁడటన్న ప్రేమ మదిఁ ♦ దాల్పక ఏఁటికి వచ్చు నచ్యుతా.

౪౧. వెలిచవి హాళిఁ ద్రిమ్మరుచు ♦ వ్రేతలమానముఁ జూఱగొందువీ
వలబలుఁడన్నయన్న యెపు♦డాసవమానుచుఁ దూగియాడువాఁ
డిల మగవాండ్ర జవ్వనుల ♦ నేకముసేసి మెలంగుచుండువాఁ
డలరులవిల్తుఁ డాత్మజుఁడు ♦ నందఱునందఱ మీర లచ్యుతా.

౪౨. తఱిఁగినవేడ్కఁ గన్నతలి ♦ తండ్రుల నాచెఱసాలనుంచి నీ
వఱిముఱిఁ జూడకయ్యెడల ♦ నప్పటికప్పుడె నందుచక్కికిం
బఱచుటగాక భోజనృపు ♦ బారికిఁ దప్పినఁ జాలునంచు పో
టఱి(రి)నెఱిఁదప్పి చన్నిడిన♦యన్నను జంపఁగనౌనె యచ్యుతా.

౪౩. ఎలమిని దల్లితండ్రులకు ♦ నెగ్గొనరింపక బ్రోచునేర్పు నీ
కలవడుటెట్టు లబ్బియును ♦ నమ్మయుఁ గల్గినఁగాక నిచ్చలున్
దలకొని పుట్టుకల్గనిన ♦ దబ్బరకానికిఁ గల్గనేర్చునే
వలనుగఁ దల్లిదండ్రులను ♦ వావిరి గొల్చెడిభాగ్య మచ్యుతా.

౪౪. జనకుని యాజ్ఞఁబూని వెసఁ ♦ జక్కఁగ దండకకేగితంటి వీ
జనములు నీదుమాటల ని ♦ జంబని నమ్మి దృఢప్రతిజ్ఞుఁడం
చనయము వేడ్కఁ బేర్కొనుదు ♦ రంతియయుక్కటనీదుతండ్రినిన్
వనముల కేగుమంచెపుడు♦పల్కెనో యించుక తెల్పు మచ్యుతా.

౪౫. భరతుఁడు రాజ్యమేలెనని ♦ పల్కఱు బల్కితివీవు నాతఁడే
యరమరలేక నే దశర ♦ థాత్మజుఁడైతినయేని రాజ్యముం
బెరయుటెటంచు బల్కెఁగద ♦ బిట్టుగ నెవ్వరిమాట నిక్కమో
సరవిగఁ దెల్పుమీవె మది ♦ సందియ ముజ్జగిలంగ నచ్యుతా.

౪౬. మునుదెలిచాయ తేజరిలె ♦ ముర్వగు నీదగుమేన నాశ్రితా
వనరతి సత్యధర్మధృతి ♦ వన్నియగాంచిన యంతదాఁక వీఁ
కను నెయి వెన్నమీఁగడలఁ♦గాఁచినపాలను మ్రుచ్చిలించుటన్
గొనకొని వ్రేతలంబలిమి ♦ గూడుటఁ గప్పి పుడానె నచ్యుతా.

౪౭. ప్రకట పరాక్రమక్షుభిత ♦ పంక్తిముఖుండయినట్టి వానరుఁ
దికమకఁ జెట్టుమాటుగొని ♦ తెల్విఁగ నేసితివింతె కాదె యొ
క్కఁ కడిఁది ముల్కి నీవెదుర ♦ గట్టిగనిల్చి పెనంగియున్న ని
న్నొక నెఱపోటుకాఁడనుచు ♦ నొప్పఁగఁ బేర్కొనవచ్చు నచ్యుతా.

౪౮. వలచెడువారు లేరొ? యిల ♦ వారిరిఁ గూడెడువారు లేరొ? చె
ల్వల నడకింపఁజాలిన వ ♦ లంతులు లేరొ ? తమంత మంతనం
బుల జలకేళిఁ దేలునెడ ♦ బొంతను చీరల ముచ్చిలించువా
రలవినియుంటిమేయొరులఁ ; ♦ బ్రామిడియౌనినుఁదక్క నచ్యుతా.

౪౯. దలశిఖిపింఛ దామములఁ ♦ దాల్పఁగ నీకగుఁగాక రత్నసం
కలిత మహార్హహారాళి నెటు ♦ గా ధరియింపఁగ వచ్చు రాజలే
లలి గురివెంద పేరులఁ గ ♦ ళంబునఁ బూనినఁగాక నవ్యహా
ర లలితశోభ నీమనము ♦ రంజిలఁజేయునె తెల్పు మచ్యుతా.

౫౦. తలఁకి జగంబులం దిరిగి ♦ తండ్రియుఁ దాఁ జెయివీడినంత ను
త్తలముగ నీదుపాదముల ♦ దండఁబడం బలుగాకిఁ గాకి వ
త్సలత ధరాతనూజ యటు ♦ జక్కఁగ నుంచినఁ గాచితంట మే
లు లలిని జావుతప్పి కను ♦ లొట్టవడం గరుణించి యచ్యుతా.

కందగర్భిత చ. ప్రవి+నత భక్తలోకపరి ♦ పాలత మోవినికృంతనాఖల
ప్రవిదలనా *నిరంతర కృ ♦ పారసపూర పరిప్లుతేక్షణా
ప్రవి×ధృత శంఖచక్ర విని ♦ పా|తిత దుర్మద దైత్యసంఘ ది
వ్య విహరణా ‡ సరోజనిల ♦ యైకనివాస మహేశ యచ్యుతా.

(ఇందు + ఈగుర్తు మొదలు*ఈగుర్తువఱకును, × ఈగు
ర్తుమొదలు‡ఈగుర్తువఱకును చదివినచో గర్భకంద మేర్పడును.)

౫౨. పలుమఱి చుట్టువాల్కఁబఱకు ♦ బంగరుచేల యలంతినవ్వుపై
నొలయుబిసాళిచూపులును ♦ నొప్పగు మోవియు ముద్దుమోము నేఁ
దలఁపకయున్న నాడుమదిఁ ♦ దప్పకతోఁచు నిదేమిచిత్రమో
మొలఁకువగాంచినప్డు కల ♦ మేకొనినప్పుడుగాని యచ్యుతా.

౫౩. తలఁకెదఁ జేరకుండె నను ♦ తాపము నంతకుమున్నె చేరరా
దొలయను సిగ్గొకించుకయు ♦ నొల్లని సేతలవెంతయేని నీ
కలవియె లెక్కసేయఁగ న♦యారె పదంపడి చేయకుండఁగా
వలయునటన్న నాతరమె ♦ బ్రాంతిగఁ బ్రోచినఁగాక యచ్యుతా.

౫౪. అలఁతిగ నాలుగక్కరము♦లంటె నటంచును, నాథమాసి మా
కొలమునఁగల్గినాఁడనుచుఁ♦గొంచెము గల్గియుఁ గల్గువాఁడనం
చెలసిన విఁక నింక మన ♦ కేమి కొఱంత యటంచు నుందు స
న్నెలమిని గొల్వలేదనిన ♦ నెగ్గిఁక నేఁదొ తెల్పు మచ్యుతా.

౫౫. పనివడి చేఁబిల్చి చెయిఁ ♦ బట్టి పదంపడి మోముదమ్మి న
వ్వొనయఁగ నీవె వేడ్క మెయి♦నియ్యది యిట్టులొనర్పుమంచు నన్
బనిగొనకున్న నొండువలెఁ ♦ బమ్మిన వేడ్క భజింపనొల్లఁ గా
న నయము మీఱ దిద్దికొని♦వచ్చికఁ బ్రోవగదయ్య యచ్యుతా.

౫౬. అరయఁగ నీకునొక్కఁడభి♦యాతియునొక్కఁడుమిత్రమౌనె యె
ల్లరఁ గని పెంచు నీవు నొరు ♦ లాగునఁ జూచితివేని యింక నె
వ్వరి కడ కేగువార మిఁక ♦ వావిరి మా కయినాలకించి యె
వ్వరు లలినోమువారు వెఱ ♦ పాఁపి మముం దరిఁజేర్చి యచ్యుతా.

౫౭. ఒరులను నేను నొల్ల నను♦నొల్లరొరుల్ మది యేమొకాని నీ
బరువడిఁ జేరి వేడ్క మెయిఁ♦బాయఁగజాలదె యింద్రజాలముల్
బరపి తొలేక మచ్చుపొడిఁ ♦ బర్వఁగఁ జల్లితొ గాని మాటికిన్
గొరకరుదాయనీ హొరతాలె ♦ కాని మఱేమియుఁదోఁచ దచ్యుతా.

౫౮. విషయవిమోహాబ్ధియ్యెడవి ♦ వేకము ముంచె యతీంద్రసాదరో
న్మిష దరుణారవింద దల ♦ మిత్ర విలోచన వీక్షణ ప్రభా
విషయముగాఁగఁ జేసియును ♦ వేడ్క నను న్గురువర్యుఁ డెమ్మెయి న్
విషమ మదీయ కర్మపరి ♦ వృద్ధికి నెద్దియుఁ జాల దచ్యుతా.

౫౯. బరువడి నీదు పాదములె ♦ ప్రాపని నమ్మితి నిక్కముత్తిజేన్
బతులను వేఁడనొల్ల నిఁక ♦ బాలను ముంచిన నీటముంచినన్
సరవగుఁగాక నీకయుని ♦ నెమ్మది నెంచితి నస్మదార్య ని
ర్భర నిరుపాధిక ప్రణయ ♦ వైభవ మేర్పడఁ గంటి నచ్యుతా.

౬౦. పలరఁగ ముజ్జగంబులకుఁ ♦ దల్లియుఁ దండ్రియుఁ దోడఁబుట్టువుం
జెలియు నను న్గుపట్టియును ♦ జేరువచుట్టము మేటిరాజయున్
బలుకులు మేలు కల్మియును ♦ బలిమియు నేడఁట యెల్లనీవకాఁ
దెలిసితి నీదువాఁడనని ♦ తేకువ నిప్పుడె నన్ను నచ్యుతా.

౬౧. అహరహమున్ బ్రియంబెసఁగ ♦ నాయుపగూపమునుజ్జగించి సం
గ్రహసుగృహాత్మరూపమున ♦ రమ్యవిభూషణ శస్త్రజాలముల్
గ్రహవిషయంబుగా నెపుడు ♦ రాజిలునిన్ బురమధ్య సంస్థమా
దహరమునం గనుంగొనుచుఁ ♦ దప్పక ధన్యతఁగాంతు నచ్యుతా.

౬౨. పృథివి కెఱుంగనీక నిను ♦ బృథ్వి వసించి తదాత్మతన్ దదా
త్త ధరణమూని యిప్పగిదిఁ ♦ దక్కక నీవయి యాత్మమట్టు స
ర్వ ధరణ కౌశలంబునను ♦ భవ్యగుణాశ్రయుతం దనర్చు నిన్
బ్రథితవివేక జాగ్రదను ♦ రక్తి నెదం గదియింతు నచ్యుతా.

౬౩. అపగత శబ్దమా నభము ♦ నందు వసించుట మాని వేడ్కమై
నుపగత భక్తవర్గముల ♦ యుమ్మలికంబులఁ దీర్చి ప్రోవఁగా
నెప్పుడును బ్రాపు యుంచు ♦ మదినెంచి సుధాజలధిన్ ఫణీంద్రుపైఁ
గపటసుషుప్తిఁ గాంచు నిను ♦ గారవమొప్పఁగ నెంతు నచ్యుతా.

౬౪. మునునవిల్లుసన్నగను♦మూసి వెనక్ దొలుఁబ్రు ముఱ్ఱిచ్చలిం
చిన పొలదిండి సోమకుని ♦ జీలిచి కల్ప విఘూర్ణ దర్ణవం
బున శఫరంబవై మెలఁగి ♦ పూన్కి మెయిన్ శ్రుతినుద్ధరింపవే
మునుకువమున్కునేచు బలు♦ముచ్చులవంపవుగాని యచ్యుతా.

౬౫. కలశముగా మహాంబునిధి♦కవ్వముగా బలుకొండ త్రాడుగాఁ
జలువల ఱేఁడు సోఁకుడులు♦జేజెలు ద్రచ్చెడి వాంద్రుగా లలిం
జలిపి మునుంగ కుండ మలఁ♦జక్కఁగ వెన్నునఁ దాల్పఁగానకీ
ఛల కమఠంబవైన నిను ♦ సారెకు నామది నెంతు నచ్యుతా.

౬౬. కొనగోని గొమ్మునం జదియఁ♦గ్రుమ్మిన పెన్వడి నేచునిప్పుకున్
దనరుపు మీఱు గుబ్బలులు♦తద్దయుఁ గ్రాఁగి కరంగ జూఱ్వ్రిది
ర్చిన నెగడొందు మీవలిఁబో♦రింబోరి జిందఱగాఁగ నెమ్మొగుల్
మును మనఁ జేడె మోచుటకు♦ముట్టె మెకంబవుగావె యచ్యుతా.

౬౭. కఠిన సటాచ్ఛటా పవన ♦ ఘట్టన నిర్దలితాభ్ర బృంద ము
ల్లుఠ దనివార్య రోష రస ♦ రోహిత లోచన వీక్షణ ప్రభా
హత హృత వైరిధైర్యము న ♦ నాదర దారిత నిర్జరద్విష
జ్జఠరమునౌ నృసింహు లలిఁ♦జాఁగిలి మ్రొక్కెద నిచ్చ లచ్యుతా.

౬౮. సునిశిత శస్త్ర సంకలిత ♦ షోడశబాహు సుతీక్ష్ణ దంష్ట్రి ము
గ్ధ నిజ వధూ కఠోర కుచ ♦ దర్శిత భంగుర భంగి మంజి మో
గ్ర నఖవిదారితాయత హి♦రణ్య భుజాంతర నిస్సృతాసృగాం
ద్ర నవవిలేప మాల్య సమ♦లంకృతునిన్ మదినెంతు నచ్యుతా.

౬౯. అలరిన వేడ్క నెమ్మదిఁ గ♦యాధుతనూభవు మాటచొప్పునన్
గలుగవె రచ్చకంబమునఁ♦గట్టడి దైత్యుని వ్రక్కలింపఁగాఁ
దొలుబటిపేర్కి నేఁడెచటఁ♦దూఱెనొ నీదగువారలన్ మమున్
బెలుచ నలంచు దుర్మతుల♦పీఁచ మడంప విదేమి యచ్యుతా.

౨౦. కలిగిన దేమొద ల్ప్రజలఁ ♦ గాఱియ పెట్టుచు నెల్లప్రొద్దులన్
గలఁచెడి క్రూరసత్త్వులను ♦ గట్టడిరక్కసు నోజఁ జీఱఁగా
వలదె కరంబు వేడ్క నిను ♦ వావిరిఁ గొల్చెడి మమ్ముఁ బ్రోవఁగా
వలదె పరాకునన్ మెలఁగ ♦ వచ్చునెయిమ్మెయి నీవు నచ్యుతా.

౨౧. సిరియును నీవు నెంతయును ♦ జిత్తమెలర్పఁ దనూజులంచు మే
లరయుచుఁ బెంపఁ బెంపుఁగని ♦ యిమ్మెయిమీపదపద్మలాలనల్
బరువడిఁగాంచు మమ్మిపుడు ♦ ప్రామిడి మీఱఁగ నేఁచుకూళలన్
సరగున మొక్కలం బెసఁగఁ ♦ జక్కడపం బనిలేదె యచ్యుతా.

౨౨. సిరి నునుకౌఁగిటం దవిలి ♦ చెన్నెసలారెడువానిఁ గెంపువా
తెఱఁ దులకించు లేనగవు ♦ తెప్పున మీఱు మొగంబువానినే
త్తెఱఁ బగదారులన్ గెడపఁ ♦ దీరగు మేల్పడివాలుఁదాల్చువా
ని రమణ మమ్మునేలు బలు ♦ నేర్పరిఁగొల్తు నృసింహు నచ్యుతా.

౨౩. తొలి సురవైరి వేలుపులఁ ♦ దోలి జగత్త్రితయంబు నేలుచో
నలుకుచునిన్ను గువ్వకొని ♦ యార్తిమెయిన్ మొఱవెట్ట వారలన్
గలఁగకుఁ డంచు నయ్యదితి ♦ గర్భమునం జనియించి పొట్టివై
లలిబలిఁద్రొక్కి వెండియును ♦ రాజ్యము నింద్రునకీవె యచ్యుతా.

౨౪. పరశువుఁ గేలఁ బూని మును ♦ పల్మరు బల్లిదులైన ఱేఁడులన్
బొరిగొని బల్మిఁ దద్రుధిర ♦ పూర శమంతక పంచకంబునన్
సరగునఁ గ్రుంకులాడి పితృ ♦ సమ్మతి తర్పణ మాచరించి ని
ర్భరపరితృప్తిఁగాంచుభృగు ♦ రామునినిన్ మది నెంతునచ్యుతా.

౨౫. పరువడి వాఁడి ముల్కులను ♦ వ్రయ్యలుగా నొనరించి పంక్తికం
ధరుఁ బరిమార్చియున్ జగతి ♦ ధన్యయనందగి యావిభీషణున్
గర మనురక్తి లంక కధి ♦ కారిగఁ జేసి భుజాబలంబునన్
బరఁగిన రాము నిన్ను మది ♦ బల్మరు భక్తిఁదలంతు నచ్యుతా.

౮౨. జలధర నీల గాత్రు జల ♦ జాత దళాయత నేత్రు భానుమ
త్కుల సరసీజ మిత్రు ఘన ♦ దుర్మద శాత్రవ జైత్రు మాధురీ
కలిత మహాచరిత్రుఁ బృథు ♦ కంటక పాపలతా లవిత్రు మై
థిల తనయా కళత్రు శుభ ♦ ధీనుతగోత్రుఁ దలంతు నచ్యుతా.

౮౩. నిన్నుఁ గని పండ్లిగిల్చిన వి ♦ నిందుఁ గళింగుని పండ్లు దుల్లగా
మునుకొని రోఁకటన్ జదియ ♦ మోది దురాగ్రహ దుర్విదగ్ధులన్
వెనఁచి హాలంబునన్ దునుము ♦ వే యిపు డిప్పగిదిన్ బరాకు నీ
వెనయఁగ నౌను సంశ్రితుల ♦ నేఁచెడి కూళల పట్ల నచ్యుతా.

౮౪. వర యువతీ ముఖాంబురుహ ♦ వాస సువాసిత వారుణీ నిరం
తర పరిసేవనారుణిత ♦ తామరసాయత లోచన హ
పరిచయ లబ్ధ వర్ణ పర ♦ భాగ మనోహర రత్నకుండల
స్ఫురణా సమగ్ర పాలుల క ♦ పోలు బలున్ మది నెంతు నచ్యుతా.

౮౫. తలి బలు వెన్న మ్రుచ్చుచును ♦ దప్పక పట్టఁగ వెంటనంటినన్
బెలుచన బారి దగ్గితిల ♦ బెగ్గిలి యంటఁగ నీక దాఁటి నీ
రొలయఁగఁ గంటఁ దప్పఁ దిఁక ♦ నొక్కపు డేనియుఁ జేయ నమ్మ యీ
పలుకును నమ్ము మమ్మ యని ♦ పల్కు నినున్ మది నెంతు నచ్యుతా.

౮౬. శిరమునఁ బింఛదామమును ♦ జెన్నఁ సలారఁగఁ జుట్టి పేరెదన్
గురివిందపేరుఁ దాల్చి యలి ♦ గోవుల వెంబడి నేగుదెంచుచోఁ
గరమునఁ జిల్లఁగ్రోవిఁ గొని ♦ కమ్మని రాగము వాయించి ము
మ్మురువుగు నింపు నింపు విను ♦ వారల నుప్పొగొల్లనిఁ గొల్తు నచ్యుతా.

౮౭. ఒసరఁగ నొక్క కేలు నిచి ♦ యొయ్యన వెన్నఁ గోవంగ బాన న
య్యొ నుప్పునఁ దల్లి కట్టుటకు ♦ నై యరుదెంచినఁ జూడఁ గాంచి దాఁ
గున గున నాలుగంజలిడి ♦ కొబ్బున బర్వక నిల్వకయ్యెడన్
గనుగవ నీరు నించుచును ♦ దల్లిరి గొల్లనిఁ గొల్తు నచ్యుతా.

౮౮. లలిని బదాఱువేవుర వ♦లంతులఁ గూడియుఁ జిన్ననాఁడె వ్రే
తల తగులంబు లందియును♦దక్కక నయ్యెనమండ్ర నాండ్ర ని
చ్చలు నెడలేని కూటముల♦జంకొక యించుకలేక దన్పుచో
నలయిక సేరరాని నిను ♦ నర్మిలి నెమ్మది నెంతు నచ్యుతా.

౮౯. కలిమల దూషితాత్ములగు ♦ కల్లరులన్ గడతేర్చి ధర్మమున్
జెలువుగనిల్ప నిజ్జగతి ♦ నేటగు వారువ మెక్కి కేల వా
ల్గలయుఁగఁ బట్టి ద్రిమ్మరుచు ♦ గాదిలిఁ బ్రోచుచు నాశ్రితాళులన్
గలికిఁదనంబునన్ మెలఁగు♦కల్కిని నిన్ మదినెంతు నచ్యుతా.

౯౦. సరవిని జక్రరాజమును ♦ శంఖముఁ బుస్తకమున్ బ్రబోధము
ద్ర రహిం దలిర్పఁ జేతుల ను♦దార కఠోర శశాంకమండలాం
తర సరసీరుహాసనము ♦ నం గొలువుండి నిజాశ్రితానవ
ద్య రుదిత సర్వవిద్యుని హ♦యాస్యుని నిన్ బ్రణుతింతు నచ్యుతా.

౯౧. కరసరసీరుహంబులను ♦ గ్రాలఁగ జానుగ నక్షమాలయున్
సరసిరుహంబుఁ బుస్తకము♦సంశ్రితకామదముద్రయున్ సుధా
కిరవరమండలాంతర వి ♦ కస్వర పంకరుహాసనస్థితిన్
గరమలరారు నిన్నెపుడు ♦ గన్కని నెమ్మది నెంతు నచ్యుతా.

౯౨. సకలకళైకనిష్ఠు ఘన ♦ సారరుచిన్ విధృతామలాంబరున్
బ్రకటకలాప్రదాన విని ♦ బద్ధసుదీక్షునిఁ బుండరీక మ
ధ్య కలితవాసు నక్షరమ ♦ యాత్మకు నక్షరు బోధవారిధిన్
వికచ సరోరుహేక్షణుని♦వేద్యుని హంసునిఁ గొల్తు నచ్యుతా.

౯3. జలనిధికన్య యంకతలిఁ ♦ జక్కవసింపఁగఁ బూర్ణచంద్ర మం
డల నవపుండరీకమున ♦ నాణెముగా నిరవుండి వేద వి
ద్యల కిరవయ్యు నాశ్రితుల ♦ కాగమజాల మొసంగువాని ని
శ్చలుని హిరణ్మయచ్ఛదుని♦సంమతిహంసునిఁ గొల్తు నచ్యుతా.

౯౪. సలలితమై ఖరిన్ జగతి ♦ సన్నుతిఁ గాంచఁగఁ గల్గెనొక్కొ గీ
ర్లలనకు వేడ్క దక్షిణత ♦ రమ్యతఁగాంచు గిరీశుమూర్తి కే
వలనుగ శక్తిపాత్రునకు ♦ వారణవక్త్రునకేని శక్తి న
య్యలఘుతర ప్రభావుని♦హయాననను నిన్ వినుతింతు నచ్యుతా.

౯౫. ఎలమి ననిష్టవారణము ♦ నిష్టసుపూర్తియుఁ జేసి నీవె మ
మ్ముల భవదీయులన్ గృశుల♦ముమ్మరమౌకృపఁజూచి ప్రోవఁగా
నలయునటంచు నీదు పద♦పద్మములన్ మదినిల్పు భాగ్య మీ
వలయునటంచు మాకెపుడు ;♦పల్మరు వేఁడెద నిన్ను నచ్యుతా.

౯౬. మనమునఁగామముల్ మిగుల♦మానసిక్రోధములోభముల్ దనం
తనలరు మోహముల్ మదముఁ♦దగ్గని మత్సరతా ప్రసక్తియున్
గొనకొని యొక్కటొక్కటికిఁ♦గొంకక పెన్గగ నీకు నిల్వఁగా
ననువగు టెట్టులొక్కొ క్షణ ♦ మైన తృణార్ధమునైన నచ్యుతా.

౯౭. చరణసరోరుహంబులఁ ♦ బ్రసన్నమతిన్ సతతంబు నెమ్మదిన్
గర మలరార నిల్పుటకుఁ♦గాఁదగు కూరిమి నిమ్ము నీయెడన్
వరమిదె వేఁడినాఁడ నిఁక ♦ వావిరి నీవయి యిచ్చెదేని యీ
వరమున కించుకేని కొఱ ♦ వాటిలకుండఁగనీయు మచ్యుతా.

౯౮. గురుమతి నాథ యామునుల♦కూరిమి నాశఠకోప సంయమీ
శ్వరుల మదీయదేశికుల ♦ సంగతిఁ జక్కఁగఁ గాంచితైన న
న్గరుణను జూడనౌనె కద ♦ నాదగు దోసము లెన్ననేటికీ
వరుసను నీకు మాటికిని ♦ వావిరి పంతముతోడ నచ్యుతా.

౯౯. అల బలిసూను నర్మిలిఁ గ♦యాధుతనూభవుఁ గాంచి కావఁగాఁ
గలుగుదుగాని యమ్మెయిని♦గారితనూభవ నాథ యామునా
దులఁగని నన్నుఁ బ్రోవఁదగు♦త్రోవ నెఱుంగఁగఁ జాలవొక్కొ య
చ్చలమును బూని నీదుమది♦సారెకలంచెదె గాని యచ్యుతా.

౧౦౦. జలధిసుతాపదాంబురుహ♦సంశ్రిత యావక చిహ్న చిహ్నితో
జ్జ్వల భవదీయ వక్షమును♦జక్కఁగఁ గాంచినఁ దత్వనిర్ణయం
బలవడుఁ గాన నీదుపద ♦ పద్మములే శరణం బటంచు ని
శ్చలమతి నమ్మినాఁడ నిఁక♦సమ్మతిఁ గావుము నన్న నచ్యుతా.

౧౦౧. జగముల నిన్నుబోలఁ దగు ♦ సద్గుణరాశియు నన్నుబోలఁగాఁ
దగుబహుదుర్గుణాశ్రయుఁడు♦దాపురమౌనొకొ యొండొకండునీ
వగునను నీకు సాటువగ ♦ నమ్మియు నేనును నాకు సాటిగా
నగుదునుగాన నన్నిపుడ♦యర్థిమెయిన్ గరుణింపు మచ్యుతా.

౧౦౨. ఎలమిని బాహుమూలముల ♦ నింపుగఁ దాలిచి నీదుచిన్నెలన్
బొలుపుగనూర్ధ్వపుండ్రమును♦మోమునదిద్దియురంబునన్ మహో
జ్జ్వల నలినాక్షమాలికలఁ♦జక్కఁగఁ బూనియు దేశికేంద్రునిన్
గొలిచినవానిఁ బ్రోచుటకొ♦కో మది నారసెదింత యచ్యుతా.

౧౦౩. నలినభవాది నిర్జరులు ♦ నమ్రిత నంజలిఁజేయు వేంకటా
చలమున మార్గినుగానయిన ♦ జాలుగనైనను జన్మమెత్తఁగా
వలనుగ నోచనైతి మును ♦ బాముల నక్కట నన్నుబోలఁగాఁ
గలిగిన భాగ్యహీనుని జ ♦ గంబుల వేఁరుఁగాన నచ్యుతా.

౧౦౪. లలిత హయాధిరోహణ క ♦ లాకుశలత్వముఁ జూప వేడుక
న్వాలలిన నెయ్యెడన్ ఖుర వి ♦ నిర్దళితోత్థిత రేణుజాలముం
గలయఁగ మాళిభాగములఁ ♦ గాంతురు నిర్జరు లట్టి వేంకటా
చలమునఁ దిర్యగాత్మకత ♦ జన్మముఁ జేకొననైతి నచ్యుతా.

౧౦౫. సరసిరుహాసనాది సుర ♦ సత్తమ మాళి సదోపలాలనా
ర్హా రుచిర పాదపంకరుహ♦నాశ్రితవత్సలు నాద్యు నవ్యయున్
సరసిజవాసినీనిలయు ♦ సారసపత్ర విశాలలోచనున్
నరనివహాయనున్ రహి న♦నారతముం బ్రణుతింతు నచ్యుతా.

౧౦౬. ఎలమినిఁ గర్మనిష్ఠుల న ♦ నేకుల నేలిన నేమి జ్ఞానని
ష్ఠులఁ గృపజూచితన్న నది ♦ చోద్యమె కూర్మిఁ బ్రపత్తినిష్ఠులన్
బలువురఁ బ్రోచితన్న నొక ♦ బ్రాఁతియె యయ్యది కచ్ఛభూములన్
లలిఁ జలిపందిరి న్నిలుపు ♦ లాగయిదోఁ చెడఁగాదె యచ్యుతా.

౧౦౭. కరము పదార మాదృతులఁ ♦ గాచిన షడ్గుణయుక్తి వన్నియన్
బెరయఁగ నేర్చుఁగాని చెయి ♦ వీడిన నేమగు నాఢ్యుఁడయ్యెడన్
గరమనురక్తిఁ బేదలకు ♦ గాంచన మిచ్చినఁగాక లోభియై
పరఁగిన నాఢ్యతాగరిమ ♦ బాగుగ మించునె దెల్పుమచ్యుతా.

౧౦౮. జలధరసచ్ఛవిన్ జలధి ♦ జాపరిరంభ సుఖాతిరేకు దో
ర్బల వినివారితాహితుఁ గ ♦ రప్రధృతాస్త్రి నిజాశ్రితైకవ
త్సలుఁ గరుణానిధిన్ విబుధ ♦ సన్నుతు వేదశిరోవిహారశీ
లు లలిని మాటికిన్ గమల ♦ లోచను నిన్ బ్రణుతింతు నచ్యుతా.

౧౦౯. శతకముఁ బల్కఁజేసితివొ ♦ చక్కఁగ నెవ్విధి నేడమూకుచే
నతులిత రమ్యరీతిఁ గృప ♦ నట్టులె చేకొని మమ్ముఁ బ్రోవు మా
శ్రితసురభూజ శర్వముఖ ♦ సేవిత పాదసరోజ దుర్నిరీ
క్ష్యతమ సుతేజ నిన్నె శర ♦ ణంచును నమ్మితి నమ్మితచ్యుతా.

అచ్యుతశతకము

సమాప్తము.



।

శ్రీహయగ్రీవాయనమః.

శ్రీమతేరామానుజాయనమః.

# అనన్తశతకము.

## గీతపద్యములు.

౧. సిరికిఁ బత్రంబులను దిద్ది ♦ చెల్వుమీరఁ
బంటవలఁతికి నునుగీలు ♦ గంటొనర్చి
నీల ముంగురులను జిక్కు ♦ నెఱిని దీర్చి
యిచ్చమెచ్చెడి నిను నెంతు ♦ నెద ననన్తా.

౨. ఆగమంబులు నమరేంద్రు ♦ లరసియునసి
తెలియఁ జాలక యలసిన ♦ దెలిసి నిన్ను
నెలమిఁ బేరుకొనంగ నే ♦ నెంతవాఁడ
నకలుష మనోహరోదన్త ♦ యజ యనంతా.

౩. శ్రుతి శిరస్సీమ సంచార ♦ సుఖసమృద్ధి
నిన్దిరాపాణి సంస్పర్శ ♦ నీయ సౌకు
మార్యసంపద నలరారి ♦ సూర్యపేయ
మైన భవదంఘ్రియుగిఁ గొల్తు ♦ నజ యనన్తా.

౪. కలవు కలవనువారికిఁ ♦ గమలనాభ
లేదనుచు బల్కువాఁడె దా ♦ లేఁడుగాని
నీవుగాని దేదియుఁ గల్గ ♦ నేరదెందు
నరయ నెమ్మది నిది నిక్క ♦ మౌ ననంతా.

౫. వేయిశిరములు కరములు ♦ వేయి కనులు
వేయి యుదరంబులును వేయి ♦ వేయి తొడలు
వేయి చరణంబులును గల్గి ♦ వేనవేల
వేవెలుంగుల జిగి నేర ♦ వే యనంతా.

౬. నీవు ధామంబు లరయంగ ♦ నిగమములును
సాధుమానసములు సార ♦ సములు నంశు
మాలిమండలమును కమ ♦ లాలయాంప
యోధరాంగణమును గాదె ♦ యో యనంతా.

౭. మాంసచక్షు ర్విషయములే ♦ మాదృశులకు
దివ్యమంగళవిగ్రహ ♦ దివ్యభూష
ణాయుధంబులు తావకా ♦ వ్యాజకరుణ
మెఱయ గాంచగ నరులమే ♦ మే మనంతా.

౮. పురుషమాత్రునిగా నిన్నుఁ ♦ బోల్ప నగునె
స్త్రీయటంచు నిక్కంబుగఁ ♦ జెప్పనగునె
స్త్రీపురుషరూప మంచును ♦ దెలియ నగునె
నిన్నిటని తెలియఁగ నేర్తు ♦ నే యనంతా.

౯. శివుఁడటంచన నౌనె నీ ♦ బ్రవిమలాత్ము
నజుఁడటంచు రజోదూరు ♦ ననఁగ నౌనె
ఇంద్రుఁడని పల్కనౌనె మ ♦ హేంద్రు నిన్ను
నీవు నారాయణుండవే ♦ నిజ మనంతా.

౧౦. గానములఁ దానములఁ బొడు ♦ చో నమేయ
గరిమ యన్నామకీర్తన ♦ గల్గుకతన
పరమభక్తి నిర్ధూతోగ్ర ♦ పాతకులయి
కరము వేడుకగాంతురు ♦ గా యనంతా.

౧౧. సామగానప్రియుండవై ♦ సామవేద
సారమగు గీతిఁ గను ప్రీతి ♦ నరసరీతి
వ్రేళ్లజన్నిదములఁ జుట్టి ♦ వెక్కిరించి
వేదములఁ జెప్పఁ గాంచెద ♦ వే యనంతా.

౧౨. వలయు వేళలఁ గుడుచుచు ♦ వలనుగాఁగఁ
జలువనీడల నిలుచుచుఁ ♦ జలువలూని
తలఁపునను జేర్చి నిన్ననం ♦ తా యటంచు
నొక్కపరి బల్కి నను జాల ♦ దో యనంతా.

౧౩. మధురమగు నీదు నామంబు ♦ మఱచియైన
నొక్కపరి నాల్కతుద నన్న ♦ నోలయు నొక్కొ
జన్మజన్మాంత రార్జితో ♦ ర్జస్వలాఘ
నివహములు పైనొకించుకే ♦ నియు ననంతా.

౧౪. ఉపవసించిన నేమగు ♦ నుస్సురనుచుఁ
దాన మాడిన నేమగుఁ ♦ దద్దప్రొద్దు
యెండ నెండిన నేమగు ♦ నెల్లపవళు
లెలమి నిను నిల్పఁజాలక ♦ యెద ననంతా.

౧౫. సురతకేళిని జొక్కియు ♦ స్సురని నెలత
చన్నుగవ వ్రాలి యురమొద్దు ♦ కన్నుదోయి
తోడ నరబల్కులతోఁ 'బ్రణ ♦ తోఽస్మి' యన్న
వేడ్క మొయి బ్రోవఁగాఁ జాల ♦ వే యనంతా.

౧౬. తీక్ష్ణమగు తపమునను సా ♦ ధింపవచ్చుఁ
దీవ్రమగు వైరమునను సా ♦ ధింపవచ్చు
దివిరి ప్రేముడినైన సా ♦ ధింపవచ్చు
నిన్ను సాధించు టరిదియే ♦ నెఱి ననంతా.

౧౭. అరుల కరయుగ భూషలై ♦ యస్త్రములగు
నస్త్రములె భూషలుగఁ దోఁచు ♦ నాశ్రితులకు
అద్భుతానేకవిధ విధా ♦ నాద్భుతము నినుఁ
బొగడ నెవఁడోపు నద్భుతం ♦ బుగ ననంతా.

౧౮. అంబురుహాలోచనాస్య ల ♦ క్ష్మాధివాస
మధురమదిరారసాస్వాద ♦ మత్తహృదయుఁ
డైన మానవుఁ డేనియు ♦ నవశత నిను
దడవినను బ్రోవవే వాని ♦ దయ ననంతా.

౧౯. జగముల నొనర్పఁ బాలింపఁ ♦ జక్కడంప
నీవ నేర్తువు సర్వేశ్వ ♦ రేశ్వరుండ
వజుఁడ వవ్యక్తుఁడ వనాది ♦ వాదిపూరు
షుండ వీ విశ్వమెల్ల నీ ♦ సొమ్మనంతా.

౨౦. బ్రహ్మశర్వాది దైవత ♦ ప్రవరు లరయ
నీదు సృజ్యవర్గంబులై ♦ నెగడుకతన
నిన్ను మించినవాఁడును ♦ నిన్నుఁబోలఁ
గలుగువాఁ డెటఁ గల్గడు ♦ గా యనంతా.

౨౧. తాత యెవ్వని పొక్కిలి ♦ తమ్మిఁ గల్గి
బయలు వెడలంగ నేరక ♦ బిమ్మరిల్లఁ
దపముఁ గావింపు మని యాఁక ♦ దయ దలిర్ప
నిడిమె నాతండ వీవెకా ♦ వే యనంతా.

౨౨. తండ్రిచేఁ గొట్టి బ్రమ్మెత ♦ దవ్వుల వెంట
బికిరమెత్తుచుఁ ద్రిమ్మరు ♦ పిచ్చివాని
కెలమి నిల్లాలిచే బిచ్చ ♦ మిడగఁ జేసి
యిడుములను దీర్చి మును బ్రోవ ♦ వే యనంతా.

౨౩. అండములు నండవర్తులు ♦ నావృతులును
ప్రకృతిగుణములు నాత్మయుఁ ♦ బరమపదముఁ
బరమ తమమగు బ్ర ♦ హ్మంబు నరయ భవదు
దంచిత విభూతు లివియెల్ల ♦ నౌ ననంతా.

౨౪. కనుల వినియెదు జానుగు ♦ లను గనియెదు
జిహ్వచే మూరుకొనియెదు ♦ చే బఱచెదు
కామకారివి నీవు నీ ♦ కరణములకు
నయము సార్వపథీనేక్ష ♦ ణం బనంతా.

౨౫. రేవెలుంగును వేవెల్గు ♦ రిక్కలరయ
నెవని తేజంబునందుట ♦ నిద్ధదీప్తు
లగుచు వెలుగొందు ననయంబు ♦ గగనవీథి
నెలమి నవ్వాని నెంచెద ♦ నెద ననంతా.

౨౬. మూర్ధ మనలుండు లోచనం ♦ బులు శశాంక
భాస్కరులు శ్రుతు లాశలు ♦ వాక్కు శ్రుతులు
ప్రాణము సమీరణుండు వి ♦ శ్వంబు హృదయ
మవని యంఘ్రులు నీకగుఁ ♦ గా యనంతా

౨౭. ఒనర బ్రహ్మంబు క్షత్రంబు ♦ నోదనముగ
మృత్యు వుపసేచనంబుగా ♦ మెసవునట్టి
సర్వశక్తివి నీవని ♦ చక్క దెలియ
నోపిన వివేకనిధి యెవ్వఁ ♦ డో యనంతా.

౨౮. నీదు రూపంబు విశ్వంబు ♦ నీవు విశ్వ
రూపుఁడవు కార్యకారణ ♦ రూపుఁడవును
పారమార్థిక భేదంబు ♦ వస్తుయుక్తి
నైకరూప్యము నీయెడ ♦ నగు ననంతా.

౨౯. అరయ దేశ మహాత్కృత ♦ మై తనర్చు
నట్టి వేకద భూషణా ♦ స్త్రావళులును
అట్టి దగు దివ్యవిగ్రహ ♦ మైనఁ బాత్కృ
తాత్మయుక్తి నీకెటు లర్హ ♦ మా ననంతా.

౩౦. దూర దేశస్థుఁడ వనియొ ♦ దూరబంధు
వనియొకో దూరసంబంధి ♦ వనియొ కాక
దూరు లగుటనో యరువుకుఁ ♦ దారు నిన్ను
దూరముగఁ జూతు రకృతులు ♦ తోడి ననంతా.

౩౧. ద్యోవు మూర్ధము వీతిహో ♦ త్రుఁడు ముఖము
చంద్రసూర్యులు నేత్రముల్ ♦ శ్రవణములు ది
శలు నభము నాభి చరణముల్ ♦ క్షితియు ననిలుఁ
డసువుగా విశ్వమయుఁడ వీ ♦ వగు దనంతా.

౩౨. ఒలయువో సూర్యచంద్రస ♦ దుద్ధదీప్తు
లెచట నీ భూనభంబులు ♦ నెలయ రాహో
ఆత్మదివ్యప్రభాభాసి ♦ తాన్తరాళ
మైన యచ్చోటు నీకిర ♦ వగు ననన్తా.

౩౩. సూరులెల్లను నిను గొల్చు ♦ వారుగాగ
భోగిరాడ్భోగ పర్యంక ♦ భాగమునను
సిరియు భూనీళ లెడయుక ♦ చేర్వనుండ
నెలిమిఁ బేరోలగంబుండె ♦ దే యనంతా.

౩౪. మందహాసంబు కెమ్మోవి ♦ సందడింప
భ్రూవిలాస మనోజ్ఞవి ♦ లోకనముల
మధురమధురాక్షరోక్తుల ♦ ముదలించు
నీను నెమ్మోము నెంచెద ♦ నెఱి ననంతా.

౩౫. మేఘనీలిమ నేలు నీ ♦ మేనిడాలు
చందురుని గేరు నెమ్మోము ♦ చంద మరయ
కమలదలముల జిగిఁ గేరు ♦ కనులతీరు
నీదురూపు మారునిత్రోఁపు ♦ నిజ మనంతా.

౩౬. ఎప్పు డేయాశ్రితున కేమి ♦ యెడరుగల్గి
యేమి మొఱ్ఱవెట్టునో విన ♦ నెద నటంచు
పరమధామంబు విడనాడి ♦ పాలకడలిఁ
గాఁపురము చేరినాఁడవు ♦ గా యనంతా.

౩౭. పాలసంద్రంపు దరఁగల ♦ బలువగురొద
నఱవిగాక దాసుల కుయి ♦ నాలకింప
వేఙ్కటాచలమునఁ జేరి ♦ వివిధగతుల
విహరణంబులఁ దేలుదు ♦ వే యనంతా.

౩౮. వేగుజాముున మేల్కాంచి ♦ వేఙ్కటాద్రి
వేఙ్కటాద్రి యటంచన్న ♦ వేనవేలు
జన్మముల నొనర్చినట్టి ♦ పాపంబు లెల్లఁ
బాచబాగాళ్ళములుగఁ బర్వ ♦ వే యనంతా.

౩౯. ఎక్కినను వేఙ్కటాచల ♦ మెక్కవలయుఁ
గాంచినను వేఙ్కటేశుని ♦ గాంచవలయు
మ్రొక్కినను శ్రీనివాసుని ♦ మ్రొక్కవలయు
నితరులను గొల్వ నేమగు ♦ నిల ననంతా.

౪౦. లలిని వేంకటశైలంబు ♦ వలనుదిరిగి
ప్రత్యహము నంజలియొనర్చు ♦ భాగ్యవంతుఁ
డైహికాముష్మిక సుఖంబు ♦ లందు టరుదె
చిక్క వేఙ్కటేశుఁడె వాని ♦ చే ననంతా.

౪౧. యాత్రయన వేఙ్కటాచల ♦ యాత్రయ యగు
నితరయాత్రలు యాత్రలే ♦ యెంచిచూడ
దైవమన వేఙ్కటేశుఁడె ♦ దైవమగును
గాక యొండును దైవంబె ♦ కా యనంతా.

౪౨. శ్రీనివాసా యటంచును ♦ జిత్తమలరఁ
బలుక నేర్చిన యవ్వాని ♦ భాగ్యగరిమ
వేయినోరులఁ బేర్కొన ♦ వెఱచుఁ జిలువ
ఱేఁడనిన నొండ్లు తెలియువా ♦ రే యనంతా.

౪౩. తండ్రి శ్రీనివాసుఁడు మాకుఁ ♦ దల్లి సిరియు
బాంధవులు వేఙ్కటాచల ♦ వాసు లగుదు
రెల్ల సంపదలును వేఙ్క ♦ టేశుపాద
కమలసేవయె వేఱొండు ♦ గా దనంతా.

౪౪. చిక్కులను దవిలియైన నో ♦ శ్రీనివాస
యనుచు బిలచినవారల ♦ యార్తిఁ దీర్చి
విడక వెంబడిబడి బ్రోతు ♦ వెడపక లలి
నెన్న వాత్సల్యవార్ధి వీ ♦ వే యనంతా.

౪౫. మహిని శునకము తనయజ ♦ మానుని యెడఁ
జూపు విశ్వాసమును జక్క ♦ జూచియైన
నెలమి నీయెడ విశ్వాస ♦ మించుకైనఁ
గట్టిగా నిల్పఁజాలము ♦ గా యనంతా.

౪౬. 'నేనునే 'నని పైఁబడు ♦ నిన్ను మాని
క్షుద్రదైవంబులను గొల్చు ♦ క్షుద్రుఁ డరయ
కామధేనువు డాసినఁ ♦ గాదటంచుఁ
గరభమును బిదికెడువాఁడు ♦ గా యనంతా.

౪౭. మొదలఁ దారంబు గూర్చిన ♦ మోయలుంచు
నేఙ్కటేశపదమ్మున ♦ వేడ్కమీఱ
సంప్రదానంబుఁ జేరిచి ♦ సరసరీతి
నోడువనేర్చిన నెలఁ జే ♦ పడు ననంతా.

౪౮. వలదు చతురాస్యలోకని ♦ వాససుఖము
వలదు జన్మంబు నిర్జర ♦ వరులలోన
వలయు వేఙ్కటశైలని ♦ వాసమెపుడు
వలయుఁ దృణజన్మమైన నా ♦ వల ననంతా.

౪౯. హరిగిరు లనన్త లౌటచే ♦ నాహ్వాయము ల
నన్తములు సుగుణములు న ♦ నన్తములు మ
హిమ లనన్తములు సుచరి ♦ తము లనన్త
ములయి పొల్తురెప్పుడు నైక్య ♦ ముగ ననంతా.

౫౦. వేఙ్కటాచల మెక్కుచో ♦ వేడ్కఁ బ్రజలు
వేఙ్కటాచలరమణ గో ♦ విన్ద యనుచుఁ
బేరెలుంగున వేమాఱు ♦ బిల్చువేళ
గగనుఁగాదె నీమది నీరు ♦ గా ననంతా.

౫౧. చిన్ని చిలుకను బెంచి శ్రీ ♦ శ్రీనివాస
యనుచుఁ బలుకఁగనేర్పి నె ♦ మ్మన మలరఁగ
మఱియు నాపల్కులనె విని ♦ మను మనుజుల
కరయఁగా నీవు కొంగుబం ♦ గరు వనంతా.

౫౨. మత్తగజమును జాచెడి ♦ మాడ్కిఁ జక్క
రాజవర్యుని గనియెడి ♦ రవణఁ జిన్ని
కందువను గాంచు తేవ నీ ♦ గరము వెఱగు
బత్తి వేడ్కలఁ గొల్వగా ♦ వలె ననంతా.

౪౩. గరులొలసి యుండినను మాకుఁ ♦ గరము వేడ్కఁ
బ్రత్యహము నిన్ను సేవింప ♦ వచ్చుఁగాదె
కలికరివిధాత మమ్మిట్లు ♦ కల్గఁజేసి
యెల్లదెఱఁగులఁ గికురించు ♦ నే యనంతా.

౪౪. నీవు మొదలనె కికురించి ♦ నీదుకొండ
దండఁ జేరఁగ నీయక ♦ దవ్వుగాఁగ
ద్రోచితివి మమ్ము నైన నిఁక ♦ దూరనేల
యరయ మాయదృష్టమ యన ♦ నో యనంతా.

౪౫. వసుపదనాథుఁడట ధరఁ ♦ బ్రజల బ్రోచు
వేడ్క నిరవున్నవాఁడట ♦ వేఙ్కటాద్రి
శిఖరమున నిత్యముక్తులు ♦ చేరికొల్వ
నతని గృతులు సేవించు వా ♦ రట యనంతా.

౪౬. ఈ జగంబున నెల్లరు ♦ నెల్లవేళ
లేగి గాంచఁగఁ దగుచోట ♦ నిరవుసేరి
నట్టి నిను గాంచనేరని ♦ యకృతిపాప
భరము నెన్న నెవ్వఁడు చాలు ♦ వాఁడనంతా.

౪౭. తావకీనపదక్రమ ♦ ధన్యసరణి
కటకతటదర్శనీయ వే ♦ ఙ్కటమహీధ్ర
శిఖరమున గోపురమ్ముగాఁ ♦ జేరువాని
భాగ్య మెవ్వాఁడు బేర్కొను ♦ వాఁడనంతా.

౪౮. స్వశిఖరాగ్రసమాలంబి ♦ సజలజలద
దర్శనసముచితోల్లాస ♦ తతసుబర్హ
బర్హిషడ్జస్వనాకులో ♦ పవననివహ
దర్శనీయంబు వేంకట ♦ ధర మనంతా.

౭౯. అమి అజల హీసు అక్షణ ♦ హారరయుణ
ణెచ్చ జొవ్వణ సుకుమార ♦ ణీలవర్ణ
యనుచు విద్యాధరీనివ ♦ హంబు పాడ
నెలమి విని సంతసింపుదు ♦ వీ వనంతా.

౮౦. స్వర్ణముఖరీసరిత్తటో ♦ పవనపవన
సంచరణ మెంతదాక నా ♦ చాయనుండు
వారి వీనుల రవిసుత ♦ వాహఘుంటి
కానినాదము లోలయవు ♦ గా యనంతా.

౮౧. మొలకనవ్వు కెమ్మోవిని ♦ ముద్దుగుల్లఁ
గరుణ దొలుకాడు చూపులఁ ♦ గాల్రిలు నీమ
నెమ్మొగము నెమ్మి మదిఁ గాంచు ♦ నేరుపరులు
కాలుఁ గలనైనఁ గాంచరు ♦ గా యనంతా.

౮౨. శేషభూధరవాస యో ♦ శ్రీనివాస
కావు మని వేఁడువారల ♦ కర్ణ పదవిఁ
గాలభటభీకరాటోప ♦ గర్జనములు
గలయ నేతేరఁ జాలవు ♦ గా యనంతా.

౮౩. నీలగోక్షీరధారోత్థ ♦ నిర్మలాత్మ
దివ్యమంగళవిగ్రహాలు ♦ దివ్యభూష
ణాస్త్రి నిను బొడగాంచుట ♦ కన్న నొండు
సుకృత మెయ్యదియును లేదు ♦ సూ యనంతా.

౮౪. ప్రణయబహుమాన లబ్ధేంది ♦ రాపదాబ్జ
యావకరసార్ద్రి ముద్రిణా ♦ యతకిరీట
రత్నరోచిఃప్రరోహ నీ ♦ రాజితాస్య
మితఁడె పరతత్త్వ మని దెల్పు ♦ నెపు డనంతా.

౬౫. సర్వవేదంబులును గూడి ♦ చక్క నిన్నె
పరమతత్త్వ మటంచును ♦ బల్కఁ గుమతు
లొండులో నిను సరిబోల్తు ♦ రొప్ప నగునె
హ స్తిమశకాంతరంబగు ♦ నది యనంతా.

౬౬. సిరి యురంబున నిరవుగఁ ♦ జేరి యనయ
మితఁడె సర్వేశ్వరుం డని ♦ యెలమిఁ దెలుపఁ
దెలియక తమోంధు లొండులఁ ♦ గొలుతు రకట
బ్రిమసి పరతత్త్వము లటంచు ♦ రహి ననంతా.

౬౭. కరుణఁదొలికెడి చూడ్కులఁ ♦ గలసిమెలసి
చిరునగవు కెంపువాతెఱఁ ♦ జిందులాడ
కమ్రకస్తురితిలకంబు ♦ గ్రాలు నీదు
నెమ్మొగము నాదుమదిఁ బాయు ♦ నే యనంతా.

౬౮. ప్రిణయపరిరంభ సమయోంది ♦ రాకరాబ్జ
కకవలయరేఖాసమా ♦ క్రాంతమగుచు
కంబుసబ్రిహ్మచారియై ♦ గ్రాలు నీదు
గలము నామది నలరించుఁ ♦ గా యనంతా.

౬౯. ఇంక నాశ్రితపరిపంథు ♦ లెల్లరు వడి
సమయుదు రటంచు దెల్పెడి ♦ జాడదోఁప
శంఖచక్రంబులను బట్టి ♦ జానుమీరు
నీదు కేల్గవ నెంచెద ♦ నెఱి ననంతా.

౭౦. ఆశ్రియింపుఁడీ పదముల ♦ నాశ్రియింప
భవపయోనిధి మోకాటి ♦ బంటియ యగు
ననుచు దెల్పెడు నా యభ ♦ యాంకజాను
ఘటితహ స్తంబు లొప్పెడి ♦ గా యనంతా.

౨౧. కౌస్తుభమణిప్రవేక ము ♦ క్తాలతావి
భాసురంబును లక్ష్మీని ♦ వాసము నయి
యంటి శ్రీవత్సచిహ్నంబు ♦ హావణుఁజూపు
నీదు పేరెద మదిఁ బాయు ♦ నే యనంతా.

౨౨. తొల్లి వేత్రతలయిరవులఁ ♦ దూరి చూర
గొన్న వెన్న పాల్పెర్వ్యులఁ ♦ గోరి త్రావి
యెల్లలోకంబులను మ్రింగి ♦ యెలమిఁ బెంచి
నట్టి నీబొజ్జఁ బొగడఁగ ♦ నౌ ననంతా.

౨౩. కరభకరికర రంభాప్ర ♦ కాండ భూరి
గర్వనిర్వాపణోద్దామ ♦ కామనీయ
కములు పీతాంబరాలంకృ ♦ తములు నగుచు
సవరుమీఱెడి నీదు నూ ♦ రువు లనంతా.

౨౪. కలమగర్భంబులను గామ ♦ కాహళులను
బరువడి నిజాభిరూప్యద ♦ ర్పమున గెలుచు
నీదు జంఘలఁ గాంచిన ♦ నెమ్మి జనన
సరణి జంఘాలతను బొందు ♦ దురె యనంతా.

౨౫. రమ్యమంజీరనినదమి ♦ శ్రశుత్రిప్ర
ణాదముగ మాటికిని నట ♦ నంబు సల్పు
నీదు పదపంకజంబుల ♦ నెమ్మనమున
నిలిపి నిచ్చలఁ మ్రొక్కెద ♦ లలి ననంతా.

౨౬. తొలుత నెయ్యది ముజ్జగం ♦ బులను గొలిచె
మోచుఁ దొలిబల్కు లెద్దాని ♦ ముదముతోడ
నట్టి భవదీయపదయుగి ♦ నలరు వేడ్క
నాశ్రయించెద బరువడి ♦ నజ యనంతా.

౨౭. బాల్యమెల్లను గ్రీడల ♦ పాలుగాఁగ
జవ్వనము విషయాసక్తిఁ ♦ జక్కఁ జనఁగ
వార్ధకంబెల్ల వంతల ♦ వలనఁ జివుక
నొనర నిను గాంచు టెప్పుడో ♦ కో యనంతా.

౨౮. తాను బ్రతికినదినముల ♦ లోన నొక్క
నిముసమైనను నిను మది ♦ నిల్పకున్న
వాని జన్మంబు జన్మమే ♦ వసుధలోన
నెన్న వానిది యొక బ్రతు ♦ కే యనంతా.

౨౯. చంచలావిలసితంబు ల ♦ టంచు దెలిసి
చంచలాక్షుల సంగతిఁ ♦ జన దిఁక నని
యెంచి మది నిల్పవలె నన్ను ♦ నించుకవడి
యేని నిల్పక బఱచుగ ♦ దే యనంతా.

౩౦. వలుద చన్గవపోణిమి ♦ వాఁడి వాలు
చూపులును నునులేనవ్వు ♦ సొంపుమీఱు
మోముదమ్ములఁ గనుగొని ♦ ముగ్ధియులకె
కైవసముగాఁగ నుంటిని ♦ గా యనంతా.

౩౧. దబ్బరలఁ బల్కితి నొకింత ♦ దలకక మది
లాతి చెలువలఁ గోరితి ♦ లజ్జవిడి
యొరుల సొమ్మెలఁ దోచితి ♦ నోట లేక
నీదుముంగల నిలచితి ♦ నే డనంతా.

౩౨. ఎలమిఁ గరుణామృతరసంబుఁ ♦ దొలుకుచూడ్కి
నొక్కయించుక నాపయి ♦ నొలయఁ జేయు
మయ్య మాయయ్య వెరవులే ♦ దయ్య యొండు
నిన్నె నమ్మితిగాదయ్య ♦ నెఱె ననంతా.

౧౩. చేసితిని దుండగంబులఁ ♦ జేయుచుంటి
జేయుచుంటి నిక్కమును ♦ జెప్పినాఁడ
మెచ్చి బ్రోచినఁ ద్రోచిన ♦ నెచ్చినకసి
నీవు గాకేమి సేయుదు ♦ నే ననంతా.

౧౪. కలలనేగాని కల్వారిం ♦ తలనెగాని
నిన్ను దక్క వేల్పోండుల ♦ నెన్న జేని
ఎన్ని యుంకున నామది ♦ యెఱుఁగవాక్క
యిప్పుడల్లిన నేమగు ♦ నీవనంతా.

౧౫. అకట నాదు దుండగముల ♦ నరయ నిన్నుఁ
దలఁపఁ దగుదు నే నేనంచు ♦ దత్తరింతు
గాక నీదుగుణంబులఁ ♦ గలయఁగొల్వ
దగుదునని యూరడిల్లుట ♦ తగ వనంతా.

౧౬. ఆరగించెడిపట్టున ♦ గూరుచున్న
యట్టితఱి మాటలాడెడి ♦ యనువున రహి
నాటలాడెడు వేళల ♦ నైన నిన్ను
మఱచి తలపక యుంటినే ♦ మది ననంతా.

౧౭. అంబరీషుని భవదీయు ♦ నలయఁజేయు
మౌనివరు గర్వమెడఁబాపి ♦ మనిచినట్టి
దివ్యసంకల్పమయమగు ♦ దివ్య హేతి
కిపుడు వాడి దఱుఁగదు గ ♦ దే యనంతా.

౧౮. కాసులార్జించువానికిఁ ♦ గడిమి తఱుఁగు
నెల్ల యెడల మోమోటంబు ♦ లెచ్చుకతన
నెవరి నేమన్న నేమొకో ♦ యేమొ యనుచుఁ
గరము నెమ్మది గొంకెడి ♦ గా యనంతా.

౭౯. లంచగొండి వీవగుట ♦ లంచి వేడ్క
లంచముగఁ బాపముల నిడ ♦ నెంచినంతె
పంచబంగాళముగ నడ ♦ తెంచె నవియు
నింక నేనేమి చేయుదు ♦ నిపు డనంతా.

౮౦. నీదురిపుల నడంపగ ♦ నీకొకండు
చెవుల నిల్లుగట్టుక పోరి ♦ చెప్పవలసె
నవుర యింత పరాకు నీ ♦ కగునె భక్త
వత్సలత యెట కేగె ని ♦ వ్వడి ననంతా.

౮౧. కల్పభూరుహాపల్లవ ♦ గర్వహారము
లగుచు నలరారు నీదుప ♦ దాంబుజముల
నాశ్రయింప విరోధిచ ♦ యంబు దానె
యణఁగు నన గోరుటది తప్పె ♦ యా ననంతా.

౮౨. తెలిసి తెలియక చేసిన ♦ తీఁపురముల
నెల్ల నీదు మనంబున ♦ నిడక నెమ్మి
నన్ను మన్ననఁగావు మ ♦ నాథనాథ
యింక వెరవొం డెఱుంగఁ ♦ గదే యనంతా.

౮౩. నీవు వాత్సల్యనిధివౌట ♦ నిక్కమేని
యెన్నరాని దుండగముల ♦ నెపుడుజేయు
మమ్ముబోంట్ల మన్ననచేసి ♦ మన్పకున్న
నింక వాత్సల్యమున కెద్ది ♦ యిర వనంతా.

౮౪. ఎలమిఁ బ్రోచినఁ ద్రోచిన ♦ నెంతయు నెడ
నీదు పదపద్మముల విడ ♦ నేర నయ్య
నిక్కమియ్యది యింకను ♦ నీదు చిత్త
మావలను నాదు భాగ్యము ♦ నో ననంతా.

౯౫. ఒగిని నినుఁ గొల్చినవెకాని ♦ తగదు బ్రోవ
ననుచు దలఁచితి వేని నీ ♦ మనమునఁ దగు
జ్ఞానభక్తిశక్తుల నిచ్చి ♦ చక్క నంత
రాయములఁ బొరదోలు మీ ♦ వే యనంతా.

౯౬. తండ్రివగు నీవు కినిసినఁ ♦ దల్లి సిరియు
నలుక బ్రోవగఁ దాఁజెప్ప ♦ దాయె నేమొ
కెరలి యాయ్యాలు నను నుపే ♦ క్షించి రేమొ
యరయ నాయదృష్టము నన ♦ నా ననంతా.

౯౭. వెన్నఁబోలు నీనెమ్మది ♦ వెన్న నిపుడు
కటికఱాయిగఁ జేసితిఁ ♦ గట్టిఁడినయి
కలిమిచెలువయు నొక్కింత ♦ గలకఁదీర్చి
కరుణ గల్గగఁ జేయదు ♦ గా యనంతా.

౯౮. తండ్రి హితపరుఁ డగుటఁ దాఁ ♦ దనయుఁ గినియుఁ
దల్లి ప్రియపరయగుచుఁ దాఁ ♦ దనయ కపుడు
విభుని నెమ్మది కలగుడు ♦ వేగఁదీర్చి
కరుణఁ దనదు కుఱ్ఱని బ్రోచుఁ ♦ గా యనంతా.

౯౯. సిరికిఁ దెలుపవుగాక నా ♦ చిన్ని విన్న
పంబు వినియుండి దే యింత ♦ వట్టు వినిన
నీచిఱుతనేరమున కిట్టు ♦ లీవు గినియు
నురక చూచుచు నుండునో ♦ కో యనంతా.

౧౦౦. మింటికెంతయు వ్రేగులై ♦ మెలగు వేల్పు
పిండులను గొల్చు వేడుక ♦ మెండుకొనదు
నాదు నెమ్మది నింక నీ ♦ పాదపద్మ
భక్తిఁ బరఁగింపవే బరు ♦ వడి ననంతా.

౧౦౧. పట్టినాఁడను నీపద ♦ పంకజములఁ
గొట్టినాఁడను పాతక ♦ కోటిఁ దూలఁ
గట్టినాఁడను గురువర్య ♦ కరుణ మూట
నెట్టు లిఁక నన్నుఁ జెయి వీడె ♦ దీ వనంతా.

౧౦౨. వకుళభూషణముఖ గురు ♦ వర్యులు మన
వాదుఁ దీర్పఁగఁ జాలిన ♦ వారు గారె
వారలకుఁ దెల్పు వారలే ♦ వలననన్న
నదియె మన కిర్వురకు నొప్పు ♦ నగు ననంతా.

౧౦౩. అరయఁ బలునాళ్లు జన్మల ♦ కైన మాన
రాని దీమనతగులంబు ♦ గాన నీవు
వీడినను నేను వీడిన ♦ విడఁగఁ జాల
దింత మదిఁ దెలియఁగ నేర ♦ వే యనంతా.

౧౦౪. నాథ యామున సంయమి ♦ నాథ పాద
పంకరుహనిత్యసంబంధ ♦ వాసితు నను
గొరలి యిమ్మెయి మది నుపే ♦ క్షించితేని
గలయు నపదూఱు కెయ్యది ♦ గడి యనంతా.

౧౦౫. కాక దమఘోషసూనులఁ ♦ గాచినట్టి
నీదు క్షమకును దూరమై ♦ నెగడు దుండ
గములు గల్గునె యెయ్యెడఁ ♦ గాని దెలుపు
మీవె యారసి నెమ్మది ♦ నిపు డనంతా.

౧౦౬. నీదుపదలఁ బట్టితి ♦ నీదు వాని
నింక నన్నుఁబ్రోవు మంచన ♦ నేమిపల్క
వగట ననుదక్క నెల్లర ♦ నరసి బ్రోవఁ
బ్రతినబట్టితివేమొ తెల్ప ♦ వే యనంతా.

౧౦౭. రహి నిపుడు త్రివిధాపచా ♦ రములనుండి
మరలఁజాల నపారత ♦ మఃప్రసరుఁడ
జాల్మునుఁడ ననన్యగతి నకిం ♦ చనుఁడ నీదు
పదములను శరణుజొచ్చితిఁ ♦ బడి ననంతా.

౧౦౮. అరయఁ బాపీయసుఁడను నే ♦ నైన నిన్ను
శరణుగోర నుపేక్షింపఁ ♦ జనదు నీకుఁ
గలుగ నీజ్ఞానశక్త్యను ♦ కంప లిపుడు
నాదు పాప మొలయరాదు ♦ నన్ననంతా.

౧౦౯. ఏమియెఱుఁగని బాలుచే ♦ నీశతకము
నెటులు పలికించినాఁడవో ♦ యెలమి నట్టు
లీవె చేకొని ప్రోవ్వ మా ♦ మ్మెప్పుడు నీదు
చరణకమలములె శరణు ♦ శరణనన్తా.

అనంతశతకము

సంపూర్ణము.



శ్రీహయగ్రీవాయనమః.

# గోవిందశతకము.

## కందపద్యములు.



శ్రీసత్యా భీష్మసుతా
భూరిసంజ్ఞానుచర సకల ♦ భువనానందా
తారిసితశాత్రవబృందా
శ్రీసేవిత మధురబృంద ♦ శ్రీగోవిందా.

౨. సత్యాపదపరిణామ
పరిత్యంచిత సబహుమాన ♦ లాక్షాంక మహా
స్నత్య మణిమాలినవ్య
ద్యుత్యధిగమితాధిరాజ్య ♦ యుతి గోవిందా.

3. ఏపేరున నినుఁ బిలిచినఁ
బారిపయి వలువల నొసంగి ♦ దారిపదికి రహిఁ
రాపడితి వప్పుదీరుప
నోపని నిరుపేదపగిది ♦ నో గోవిందా.

౪. ఒక తెఱఁ జనుకట్టయి వే
ఒక తెఱకు మానికపుఁగోరివ ♦ యొప్పించుచును వే
రొకరితె కందియ యగు ని
న్నొకవహి నూహింపనగునొ ♦ కో గోవిందా.

౫. మాటికి వ్రేతలకన్నుల
కాటుక రేక యని వేడ్కఁ ♦ గాంతురు నిన్నా
బోటులచనుగవఁ బూసిన
నేటగు కస్తురిగ నెంతు ♦ నే గోవిందా.

౬. బృందావనప్రతోలీ
సందానితపారిజాత ♦ సౌమనసరజ
స్స్యందవ్రజయువతీపద
విందా మము వేడ్కఁ బ్రోవ ♦ వే గోవిందా.

౭. ఘనజఘనముఖర మేఖల
యనఁదగి యొక చెలికిఁ బైట ♦ నమరిన పైఠా
ణి నెఱిఁ దనరితివి యొండొక
వనఁబోఁడికి నింతచుల్క ♦ నా గోవిందా.

౮. ఆనుడుబిళ్లయు మేలగు
పానుపు నీవేని యల్ల ♦ పై దలులకు ని
న్నానయమునఁ బావలటం
చేనన నన్నుఁ గోపగింతు ♦ వే గోవిందా.

౯. చిలువలఱేఁ డెవ్వడువునఁ
గలరూపులఁ దాల్చి నిన్నుఁ ♦ గాటపుకూర్మిఁ
గొలిచెడి నీవా వహి వ్రే
తలఁ గొలిచితి వన్న నొప్ప ♦ దా గోవిందా.

౧౦. సకలభువనాధిరాజ్య
ప్రకటయశోవిభవ మేడ ♦ వల్లవవనితా
భ్రుకుటికౌటిల్యసాధ్వస
వికలత్వం బేడ దెల్పు ♦ వే గోవిందా.

౧౧. గోవర్ధనోద్ధరణ పరి
భావితపురుహూత వర్ష ♦ భరరక్షితగో
గోవల్లభ వల్లవజన
మావల్లభ మమ్ముఁ బ్రోవు ♦ మా గోవిందా.

౧౨. గోపయువతీవిహారో
ద్దీపితమన్మథరహస్య ♦ దివ్యవధూటీ
ప్రాపిత మోహన లీలా
స్వాపసమానుష్యసుమన ♦ సా గోవిందా.

౧౩. యమునాసైకతసాక్షిక
సుమనోద్వంద్వాభినంద్య ♦ సుమశరలీలా
క్రమపరితోషితవల్లవ
రమణీపరిచరణనిత్య ♦ రత గోవిందా.

౧౪. చిరవిస్మృతబంధక్రియ
సురమిథునాచార్యకత్వ ♦ సురభిలపులినో
త్తరకాలిన్దీపరిసర
పరిచితకాన్తార కుతుక ♦ భర గోవిందా.

౧౫. చల్లని రాగము నీవల
పిల్లనగ్రోలునను బాడఁ ♦ బ్రేమాంధత నా
వల్లవయువతులు పతులను
నొల్లరయిరి సుతుల హితుల ♦ నోగి గోవిందా.

౧౬. చరణసరోరుహముద్రా
పరిశోభితపులినభాగ ♦ పావనయమునా
పరిసరమున నినుఁ గాంచుచు
నిరవుండగ మాకుఁ గల్గు ♦ నే గోవిందా.

౧౭. గోపకు లేవగ నోచిరొ
గోపతిముకుటంబు సోఁక ♦ గూడని దివ్య
శ్రీపాదంబులు సోఁకిన
యాపట్టుల నిరవుకొనుట ♦ కై గోవిందా.

౧౮. మురళీగానార్ద్రపులిన
సరణుల రే యొంటి నరయు ♦ చానల నీవా
వరుసఁ గికురించి వేఁచితి
వరయుగ నీమనము చట్టె ♦ యా గోవిందా.

౧౯. విరహాసహాంగకంబులఁ
దరణిసుతామధ్యపులిన ♦ తలి నొత్తుచు నా
వరయువతులు నిన్నగసినఁ
గరుగవె నిలువెల్ల నీరు ♦ గా గోవిందా.

౨౦. రాసక్రీడావసరో
ల్లాసవ్రజసుందరీవి ♦ లాసము లెంతే
నాసఁగొలుపఁ బలుతెఱఁగులఁ
బై సరములఁ గూడి యాడ ♦ వా గోవిందా.

౨౧. తలఁ బింఛదామ మురమునఁ
గలసిన గురివెంద పేరు ♦ కౌనున మొలనూ
లొలసిన చిరుగంటలు జిలి
బిలిగ నలియ నాటలాడ ♦ వే గోవిందా.

౨౨. చెలువలచేత న్నందియుఁ
దలవంపని నెమ్మనమునఁ ♦ దలపోయవు సి
గ్గిలవు దలంక వొకింతయుఁ
గలయఁగ నీజాడ వింత ♦ గా గోవిందా.

౨౩. తిట్టువడి మదినిఁ గలఁగవు
గట్టువడియు నొక్కచోటఁ ♦ గాలూనవు నీ
పట్టిన పట్టు న్విడవు
దిట్టవు నిన్నీవు తెలియు ♦ దే గోవిందా.

౨౪. తిట్టినఁ బొగడ్తయగు మదిఁ
దొట్టిన కూరిమి మఱొండు ♦ త్రోవన నిన్నౕ
నెట్టనఁ బొగడం దొడఁగినఁ
దిట్టగు భక్తియన నట్టి ♦ దే గోవిందా.

౨౫. అంటిన ప్రేముడి నెమ్మది
గెంటిన గెంటసములాడి ♦ గేడించిన నిౕ
గొంటుతనంబున నీమది
గంటగిలెడి జాడ నేర్చు ♦ గా గోవిందా.

౨౬. సరవిని మఱందినని నిను
సరసఁ బిలిచి పనులఁ జెప్పి ♦ సరగునఁ బుత్తెం
చిరి యింతె చాలునని కురు
వరుపాలికిఁ బఱవఁ జూతు ♦ వా గోవిందా.

౨౭. మేనమఱందియటంచును
బూనికె మెయి దేరఁదోలఁ ♦ బోయితి వౌరా
యా నీమది వాత్సల్యము
నేను బేరుకొనఁగ నేర్తు ♦ నే గోవిందా.

౨౮. సరివారిలోన జుల్కన
సరిగాదని నెమ్మనమునఁ ♦ జక్క దెలియవే
వరుస నన్నింటి కేనని
బరువడి సికజార బరతు ♦ వా గోవిందా.

౨౯. నీదగు విరాట్స్వరూపముఁ
దాఁ దనియఁగఁ గాంచియైన ♦ దప్పకనుదురా
నౌదల దాల్పఁగ మది నను
వేది పుట్టుచీకు దలఁచె ♦ నే గోవిందా.

౩౦. మావులఁగోలెం గవ్వడి
నీవావహిఁ గోలనడిచి ♦ హితవులఁ దెల్పం
దా విని యవ్వడి యేగిన
నేవహి నిను గాంచెఁ దెల్ప ♦ వే గోవిందా.

౩౧. నీకై బోరితువు గాకీ
మావహిఁ గని బోరితువన్న ♦ మాట హుళిక్కియౌఁ
గావున నెమ్మది నన్నిం
కీవని తెలియుటయె మేల్గ ♦ దే గోవిందా.

౩౨. సందియ ముజ్జగిలఁగ నా
నందముతో నీవె యర్థ ♦ మానతి యిమ్మా
యందఱిలో గీతాంతపు
సందానితపద్యమున కె ♦ సగ గోవిందా.

౩౩. విచ్చలవిడి పద్యంబున
కచ్చువడినజాడ నివియ ♦ యర్థములంచుం
బెచ్చుగు గిన్కం దన్నుక
చచ్చిన నటు మోమిడవు మ ♦ జా గోవిందా.

౩౪. విశ్వాసశీలి కర్ణము
విశ్వాసి కనర్థమనుచు ♦ వేనోళ్లను దా
విశ్వాసమిడక బల్కఁడె
విశ్వగురుం డపుడె కాడు ♦ పడీ గోవిందా.

౩౫. విహితవిషయప్రవృత్తి
యవిహితవిషయవిముఖవృత్తి ♦ వేదవిహిత మా
విహితవిషయవినివృత్తియు
విహితము శాస్త్ర్యంతసిద్ధ ♦ విధి గోవిందా.

౩౬. విషయపరామర్శంబున
విషయవిషయకప్రవృత్తి ♦ విహితంబగు నా
విషయవిమర్శపరాఙ్ముఖ
విషయవిహితవృత్తి విషమ ♦ విధి గోవిందా.

౩౭. స్నానపరిదాయసూద్ధృత
సత్సాంగత్యోపలబ్ధ ♦ సత్కృత్యాంచ
స్వాత్మాంవిస్ఫురిదదేశిక
పత్త్రైవాప్రాప్యసిద్ధ ♦ ఫల గోవిందా.

౩౮. పీయూషంబు జనించిన
యాయెడ హాలాహలంబు ♦ నంటె జననమా
యాయెడ నావహి సదస
ద్వ్యాయతి మది నూహసేయ ♦ నో గోవిందా.

౩౯. అన్నమె యమృతము మఱి యా
యన్నమె కా విషము పరిణ ♦ తాయువునకు నా
వన్నియ నొకయర్థమె యిరు
వన్నియలకు నంచు దెలియ ♦ వలె గోవిందా.

౪౦. అర్థము పరమంబైన స
నర్థము సారంబునగు జ ♦ డాత్మునకు వివే
కర్థికి రత్నమువలె నీ
యర్థము మునుమున్నె తెలియ ♦ నో గోవిందా.

౭౧. వైష్ణవులయ్యును శాక్తం
భూష్ణులయినవారి నెన్న ♦ బోలునె సచ్ఛ్రీ
వైష్ణవులకు భువనైకవి
భూష్ణువులకు మఱచియైన ♦ భువి గోవిందా.

౭౨. పరమార్థవేత్తలగు గురు
వరుల పదాంభోరుహములు ♦ భవ్యతమభవ
చ్చరణసరోజములును మా
శిరముల కాభరణములగు ♦ శ్రీగోవిందా.

౭౩. ఇతరోపాయాసహవి
శ్రితపరమోపాయరూపు ♦ సులభోపేయా
త్మత సిద్ధఫలతఁ దనరిన
శ్రితసీమంతమణినిఁ గొల్తు ♦ సూ గోవిందా.

౭౪. హేయప్రతిభటసుగుణా
ధేయుఁ గొలుచునట్టి బుధుఁడు ♦ ధీమాంద్యమునన్
హేయవిషయమునఁ దవులునొ
కో యరుణునిఁ దమము చెందు ♦ నో గోవిందా.

౭౫. అనపాయోపాయోపే
యుని వాత్సల్యైకజలధి ♦ నుపగతసార్వ
జ్ఞుని సర్వేశ కి నంజలి
పనియించితు నిన్నుఁ జూప ♦ నే గోవిందా.

౭౬. ధర్మంబన నెయ్యదియొ యు
ధర్మంబన నెద్దియొ ♦ కొ- తగఁ దెలియని యా
కర్మమున కేమిసేయుదు
నిర్మర్యాదుండ గొల్తు ♦ నిను గోవిందా.

౪౭. తల్లియుఁ దండ్రియు నోజయు
నెల్లతెఱంగులను విందు ♦ నీవె యనుచు నీ
యుల్లమున నమ్మియుండితి
నెల్లిదముగ నిపుడు చూతు ♦ వే గోవిందా.

౪౮. ఆభాసబంధువులయెడ
నాభాసప్రేమభరత ♦ నలయుగ నేలా
శ్రీభాసితు నిను బాంధవ
ధీభావనఁ జూడనగుఁ గ ♦ దే గోవిందా.

౪౯. నిరుపధికబాంధవుఁడ వీ
వరయఁగ భువనములకెల్ల ♦ నైనను మాయా
పరిభూతులమై నెమ్మది
నోరులను జుట్టలుగ నెంతు ♦ మో గోవిందా.

౫౦. విద్యాధనాభిజనముహు
రుద్యోతితదురభిమాన ♦ యోగసముదిత
విద్యాపరిభూతాత్ములు
హృద్యంబుగ నిన్నుఁ గాంతు ♦ రే గోవిందా.

౫౧. అర్థంబుల నార్జింతు న
నర్థంబులఁ జేరనీక ♦ నమ్మోయిని గుటుం
బర్థి నోనరింతు నంచు ని
రర్థకచింత నలయింతు ♦ వా గోవిందా.

౫౨. ఈయాలుబిడ్డలెట్టులో
నాయనువున మనుదురంచు ♦ నాదు తలంపే
నేయనువున నేమగుదునో
కో యని పరికింపనైతి ♦ నో గోవిందా.

౫౩. విడుటకు విడకుండుటకే
వడువును మదిఁ దోపకునికి ♦ వడిఁ గర్మములన్
బెడద మునింగియు నీదగు
కడపటినుడి నూరడిల్లితిఁ గా ♦ గోవిందా.

౫౪. ఏయేయవి యొనరుపనగు
నాయాపనులఁ దెలియంగ ♦ నానతి నియురా
దే యా వ్యామిశ్రోక్తుల
నే యనయము మమ్ము నేచె ♦ దిటు గోవిందా.

౫౫. ఒకపరి నీనోడి నమ్మక
మొకయించుక గలుగఁజేయు ♦ నొండొకపఱి న
మ్మిక దఱుగఁజేయు నామది
కకటవికటమంచు దోఁచుఁ ♦ గా గోవిందా.

౫౬. నాచిత్తభ్రమ మణఁగఁగ
నీచిత్తభ్రమము నొలయు ♦ నీక దెలుపు మీ
వే చిదచిదీశతత్త్వజ్ఞా
నోచితగీతార్థసార ♦ మొగి గోవిందా.

౫౭. 'కావేరీతోయ 'మ్మను
పావనతరపద్యమునకుఁ ♦ బరమార్థంబీ
వేవహి నానతి యిచ్చితొ
యావహి గీతార్థ మొసఁగ ♦ నా గోవిందా.

౫౮. సారతరార్థంబుల నీ
వారసి యెఱిగింపుమయ్య ♦ యనయము మాకున్
ధారణ మనమున కలవడ
గా రహిఁ గరుణించి మున్ను ♦ గా గోవిందా.

౫౯. పూర్వాచార్యశ్రీసూ
క్త్యర్వాచీనార్థసమితి • నానతియిమ్మా
గుర్వాస్వాధిగతాద్యను
పూర్విగఁ గరుణించి నాకి • పుడు గోవిందా.

౬౦. నాలుగుపురుషార్థంబుల
వ్రీలఁగ నాద్యంతములు క • లిపత్రిబలతచే
వాలినపురుషార్థయుగిన్
దేలెడి మముఁ గాంచి గినియు • దే గోవిందా.

౬౧. చెలిపలుకులె ప్రాఁబలుకులు
వలరులవిలుకానిపోరె • యధ్వరములు మా
కెలప్రాయఁపు నెలఁతుకరవ
పలుకులె మంత్రింబు లెంత • వడి గోవిందా.

౬౨. పరధనములో నిజధనములో
యరయక మది వలయువేళ • నర్థిగొనుచు నే
వరుసనో గొరవడకుండగ
నురవడి వెడపనులఁ జేతు • నో గోవిందా.

౬౩. తలఁపున నొక టింకొక్కటి
బలుకున వేరొకటి సేతఁ • బరువడి నాకే
వలన నివియెల్ల నొకటిగ
నలవడు తెఱ వెఱుకపడఁగ • నొ గోవిందా.

౬౪. నావాఁడవు నీవంచన
నావాఁడనె నేనటంచు • ననిచిన వీకన్
త్రోవ దొరంగి బెనంగితి
నీవడిఁ గృప నన్నుఁ జూడ • వే గోవిందా.

౬౫. తెలిసియుఁ దెలియక చేసితి
వలయు దుండగముల నెల్ల ♦ వడి నీయెడ నిఁ
గొలిచెడి వారలయెడ నే
వలన నన్నుఁ గరుణఁ జూ ♦ డవా గోవిందా.

౬౬. తిరమగు కూర్మినో వెఱవాం
డరయగ లేకుంట నొక్కఁ ♦ యలసి సొలసి నిఁ
శరణంచు వేడి తివ్వడి
నరువుమెయిని నన్నుఁ బ్రోవు ♦ మా గోవిందా.

౬౭. నిరయమొ త్రిదివమొ ధరణియొ
పరమపదమొ యెచటనైన ♦ భవదంఘ్రియుగిఁ
శరణని నెమ్మది నమ్మితిఁ
గరణత్రయశుద్ధిపూర్వ ♦ గా గోవిందా.

౬౮. ఈకల్పంబునఁగాని మ
హాకల్పంబున నెగాని ♦ యుండెడి నిన్నే
లోకము లెల్ల ననిన యా
స్తోకము నిను నంటకుండు ♦ నే గోవిందా.

౬౯. సకలంబు నీవిభూతిగ
సకలమయునిగాఁగ నిన్నుఁ ♦ జక్కఁ దెలిసి ధీ
వికలతఁ జింతిల నేటికి
యొకచేతనమునకు జగతి ♦ నో గోవిందా.

౭౦. కలుషంబులఁ బోకారిచి
ఖలునైనను గరుణఁ బ్రోవఁ ♦ గాఁ జాలిన నీ
పలు తెఱఁగుల మదిఁగలఁచెడి
పలుకుల నే బొగడవలెనె ♦ బళి గోవిందా.

౨౧. లీలాత్రిపాద్విభూతుల
నేలెడి దొరవీవె కాన ♦ నెయ్యెడనైన న౯
వాలాయము నీ౯ దనుపఁగఁ
జాలిన పను లొనరఁజేయఁ ♦ జను గోవిందా.

౨౨. లీలకె పాత్రునిగా నను
వాలాయము జేయఁ దలఁతొ ♦ పరమపదమున౯
బాళిమెయి సూరివర్గము
లో లాలనఁ జేయఁ దలతొ ♦ లో గోవిందా.

23. గహనంబు కర్మగతి యతి
గహనముగా జ్ఞాననిష్ఠ ♦ గహనంబులలో
గహనము ప్రపత్తినిష్ఠయు
గహనంబే జాడగలయఁ ♦ గా గోవిందా.

౨౪. పరిహారమొ పరిహారార్థంబొకొ
యహరహ మాత్మ నిను నిల్ప ♦ నభ్యాసం బే
వహిఁ జేయఁగ నగు విషయ
గ్రహపరిభూతులగు మాకు ♦ రహి గోవిందా.

౨౫. అనుకూలపక్షమున మా
కనువగు పరికరము లెందు ♦ నరసినఁ గనరా
వనయము ప్రతికూలవిధం
బున నన్నియుఁ బరికరములె ♦ పో గోవిందా.

౨౬. మదిఁ గామక్రోధంబులు
వదలక పెనగొనఁగ నెట్లు ♦ వాలిన పేర్మి౯
బదిలముగ నిలుపనగు నినుఁ
బదపడి యెఱిగింపు మొక్క ♦ వహి గోవిందా.

౨౭. గురువరుపట్టున గూరిమిఁ
బెరయింపుము నాదు మదిని ♦ వేమరు న
గ్గురువరు దైవమ్ముగఁ గను
పరమజ్ఞానమ్ము నీవె ♦ వడి గోవిందా.

౨౮. గురువరుఁడె నాదు దైవము
గురువరుపదసేవనంబె ♦ కూర్చినధన మా
గురువరుఁడె యనుఁగుఁజుట్టము
గురువరుకన్న మఱొండు ♦ కొఱ గోవిందా.

౨౯. దైవంబులఁ దీర్థంబుల
దేవళములఁ జూచు వేడ్క ♦ దేశములఁబడిన్
బోవఁగ నెంచును గురువరు
దైవంబుగఁ గాంచు ఘనుఁడు ♦ తా గోవిందా.

౩౦. గురువరు మనుజుగ నర్చా
హరి నుపలాత్మునిగ వైష్ణ ♦ వాగ్రణిని జాతిన్
బెరవానిగ మదిఁ గాంచెడి
దురితాత్ములు నిరయ మందు ♦ దూరు గోవిందా.

౩౧. ప్రపదన మొనర్చి యొకపఱి
యపచారాశంకఁ బ్రపద ♦ నాచరణ పోరిన్
విపరీతంబుగ నయ్యది
యపచారంబునకు సాటి ♦ యౌ గోవిందా.

౩౨. మధురకవ్యాంధ్రపూర్ణా
ద్యధిగతనిష్ఠావిశేష ♦ మలవడ మమ్మున్
మధురంబుగఁ గరుణింపుము
మధితాన్యాత్మప్రవృత్తి ♦ మతి గోవిందా.

౭౩. అలుకంబూనిన నీమది
సలుకఁదీర్చి బోవనేర్చు ♦ నాచార్యుఁడు దా
నలగిన నీవా తనిమదిఁ
గలకం దేర్చంగఁ బోవు ♦ గా గోవిందా.

౭౪. చరమార్థనిష్ఠునకు సీ
వరయు దేవతాంతరంబె ♦ యనఁ దగునువుగా
గురువరుగా కొండొరు నే
వరుసనైన నతఁ డెఱుంగు ♦ నే గోవిందా.

౭౫. గురువరుఁ డొనరించిన యా
పరమోపకృతిం దలంచు ♦ భవ్యతమునకే
వరుస గురునెడసి యొండెడ
నరనిముసంబైన నిల్వ ♦ నగు గోవిందా.

౭౬. గురువరు నలరింపఁగ నీ
బరువడి నర్చించు చరమ ♦ పర్వసునిష్ఠుం
డరయఁగ గురువరునెడ మదిఁ
గర సునురక్తి మెయి జెలఁగుఁ ♦ గా గోవిందా.

౭౭. నిను నర్చించు నిజాచా
ర్యుని కరకమలములచేత ♦ నొగి దానాచా
ర్యుని పాదసరసిజంబుల
మునుకువ నర్చించుఁగాదె ♦ మును గోవిందా.

౭౮. ఏనొనరుచు బరిచర్యలఁ
బూనిక మెయి నంచు నహము ♦ బూనియులయు నా
మానవుసపర్యయే వహి
మానుగ నలరించు నీదు ♦ మది గోవిందా.

౮౯. తావకసేవకనివహము
తో వలనుగఁ జేరి నిన్ను ♦ దోరపువేడ్కన్
సేవించుభాగధేయము
నీవై మాకొసఁగి బ్రోవ ♦ వే గోవిందా.

౯౦. తావకపాదసరోరుహ
సేవాచరణప్రవీణ ♦ చిత్తసరసిజుం
డేవలనైన నేర్చునె
కైవల్యంబనుచు బల్కఁ ♦ గా గోవిందా.

౯౧. శ్రీవరసాయుజ్యంబను
సేవధి విడనాడి నీదు ♦ సేవకు లకటా
కేవలపదమను చీకటి
బావినిఁబడ నెన్నుదురొకో ♦ వడి గోవిందా.

౯౨. అగడితనుబడ్డ పిల్లికి
నగు నదె వైకుంఠమనిన ♦ యూవహి కైవ
ల్యగతిగతజనుని గతి యని
తగఁ దెలియఁగవలయు విబుధ ♦ తతి గోవిందా.

౯౩. తావకపదసరసీరుహ
సేవైకరసానభిజ్ఞ ♦ చేతస్కులు రహిన్
కేవలపద మొకపదమని
భావింతు రభాగ్యు లెంత ♦ వడి గోవిందా.

౯౪. బాలిశుఁడైన నొకప్పుడు
వాలాయము నీదు కరుణ ♦ వడసి మనగలం
డాలీలఁ గేవలుఁడు భవ
దాలోకసుఖంబు నొలయు ♦ నా గోవిందా.

౯౫. ఆత్మావలోకనస్పృహ
నాత్మ నలయఁ జేయుఁ గాని ♦ యాత్మారాముం
డాత్మారామునిగా నిను
నాత్మఁ దెలిసి సుఖమునందు ♦ నా గోవిందా.

౯౬. ఆత్మజ్ఞానము గల్గియు
నాత్మసుయాథాత్మ్య వేద ♦ నాలసుఁడగు నా
యాత్మజ్ఞుని యజత కే
యాత్మ నలయకుండ ♦ నా గోవిందా.

౯౭. కైవల్యమనగ వెఱతురు
తావక కైంకర్యనిత్య ♦ తత్పరులు మహా
ర్భావన నీవది యొసఁగఁగ
భావించెద వనెడి శంకఁ ♦ బడి గోవిందా.

౯౮. నిరయంబన్నను వెఱపెదఁ
బెరయుదు కైవల్యమంచు విన ♦ బెండునకుక్
బరువడి ధీరవరుం డా
తరతమభావంబు నరయఁ ♦ దగు గోవిందా.

౯౯. ఎంచి "సదాపశ్యంతి" య
టంచు బలుకు శ్రుతికి నర్థ ♦ మనవరతము స
మ్యంచితవివేకవైభవుఁ
డెంచు నె కైవల్యపదము ♦ నెఱ గోవిందా.

౧౦౦. భక్తిప్రపత్తిసంతత
యుక్తి భవత్కింకరత్వ ♦ యోగోచితుఁ డా
సక్తి కైవల్యసేవా
ద్యుక్తిపరిశాంతి నొలయు ♦ నొకా గోవిందా.

౧౦౧. శ్రుతిశతశిరోవిభూషణ
తేందిరాక ♦ రాంబుజయోగం
బహులశరణ్యాంతర మా
శ్రితులకు భవదంఘ్రియుగము ♦ శ్రీగోవిందా.

౧౦౨. ఇంద్రియతురగంబుల ని
స్తంద్రాగతి విషయవీథిఁ ♦ దలఁపను వగదం
బు ద్రిప్ప తిరుగువడి శమ
ముం ద్రోచితి దవ్వుగాఁగ ♦ ఘను గోవిందా.

౧౦౩. పరమజుగుప్సితసుఖముల
బరువడి సుఖములని భ్రమసి ♦ పరువిడితి వడిఁ
బరమార్థసుఖము నెఱుఁగక
నరు వేది కడింది వెడగు ♦ నై గోవిందా.

౧౦౪. ఉమ్మలిక మెనసియైనను
గ్రమ్మర దీనున మదేమొ ♦ కాని సుస్మృతిఁ
బమ్మిన వేడుకఁ బలుమఱు
ద్రిమ్మరుఁ బ్రకృతిగుణ మిట్టి ♦ దే గోవిందా.

౧౦౫. జనియించియు నాథమునీం
ద్రుని ఘనవంశంబునందు ♦ దుష్పథసంచా
రనిరతిఁ దవిలితిఁ గానగాని
నినుఁ దెలియఁగ నేరనైతి ♦ నే గోవిందా.

౧౦౬. అతిలంఘితమర్యాదుఁడ
నతిశయితేర్ష్యుఁడ వంచ ♦ నాసక్తుఁడ సం
సృతిజలధిసంతితీర్షా
మతి నిను శరణంటుఁ బ్రోవు ♦ మా గోవిందా.

౧౦౭. ధర్మంబుల విడనాడితిఁ
గర్మంబుల నెల్ల ద్రవ్వఁ • గాఁ దోలితి ని
ర్మర్మంబుగా సనాతన
ధర్మంబగు నిన్నుఁ దెలియు • తఱి గోవిందా.

౧౦౮. శ్రీభూనీలానాయక
భాభాస్వర శంఖచక్ర • పాణి సరసిజా
ఆభోగిభోగిభోగశ
యా భవ్యగుణాలవాల • యా గోవిందా.

౧౦౯. శతకం బేవహిఁ బలికిఁ
చితో నీవావలన వేడ్కఁ • జేకొని యనయం
బతులితకృప మముఁ బ్రోవుము
శ్రితవాత్సల్యాభినంద • శ్రీ గోవిందా.

గోవిందశతకము

సమాప్తము.



